# వత్సరాజు

ఉభయభాషాప్రవీణ

కొత్త సత్యనారాయణ చౌదరి




కవిరాజ పబ్లిషర్సు

తెనాలి :: సికింద్రాబాదు

 1953 [వెల 1-4-0

చౌర్యమో శౌర్యమో సాహసమో సౌరస్యమో ఏమైనా నా స్వనయితి గాదు; ఆ పూర్వులు పెట్టిన భిక్షయే ఆ పెద్దలు చేసిన భారతీ వరివస్యయే సత్ఫలోదర్కము కావుటకై సహృదయసమ్మతమైన శ్రోవలో ఇదానీంతనులు నడువక తప్పదను మాట మూమ్మాటికి నిక్కము. పద విన్యాసములో భావరచనములో విషయసమన్వయములో ఏదో ఒక క్రొత్తదనము తొడిగి అరఁటిపండుగా ఒలిచి అరచేతిలో పెట్టినట్లు చూపినఁగాని నేఁటి కుఱ్ఱకాఱు ప్రాచ్యము జోలికి పోరు. పైఁగా నవీన మన్న మోహమునకుఁ జిక్కి ప్రాఁతదనమునకు ఏవగింతురు.

ఈ భావమును ప్రాతిపదికగా పెట్టుకొని పురాతన వాఙ్మయ ఖనిలో నుండి రత్నములని నాకుఁ దోచిన ఘట్టములను ఎత్తి శక్తిమెయి సంస్కరించి పులుగడిగి ఈతీరుగ వెలయించితిని. ప్రాంతీయ భాషలకు ప్రాభవ మేదో ఒరిగి ఒడిలో పడునని మురిపపడు—ఈనాఁడు జాతీయత దొఱఁగని దేశీయత మాయని ముచ్చట నిచ్చు మధురరచనలు తెలుఁగున - ఎన్నో పుట్టవలసి యున్నవి. ఈ యుద్యమమునకు అధికారిబృందము సర్వాత్మనా చేయూఁత నిచ్చి భాషా వికాసము కూర్తురని పదేపదే ప్రార్థింతును.

—సత్యనారాయణ చౌదరి

## ౧

## పుట్టుపూర్వములు

అనంత కల్యాణ నిధానమగు నార్యావర్తములో గంగా యమునా మధ్యమున వత్సదేశము గలదు. నాకలోక గర్వ మణంచుటకయి విరించి దానిని సృజించెనా యని కవివరు లద్దానిని దద్దయుఁ బ్రస్తుతింతురు. కలుములకు నెలవయిన కౌశాంబి యను నగరము దానికి రాజధాని. అయ్యది భరతవంశ రాజులకుఁ గాణాచి యగు పట్టణము.

తొల్లి భారతయుద్ధమున నెల్లవారి పొగడ్తలను బెల్లుగాఁ బడసిన బల్లిదుండగు వీరాభిమన్యునకు మునిమనుమండై మొనకాఁడగు శతానీకుఁడను రాజు కౌశాంబికిఁ బ్రభువు. నిజభుజాదండ విక్రమముచేఁ ద్రిపురాంతకుని సైతము మిక్కిలి వణఁకించి దేవతల మెప్పు వొందిన పాండవ మధ్యముం డవ్వాని వంశమునకు మూలపురుషుండు కావుటను వానికి నీడగు ఱేఁడు నాఁడు లేడు. చిరకాల మాతఁడు వసుంధర నేలియు బిడ్డపాపలు లేక బిట్టుగ వగచి నోములు నోఁచి పుత్త్రికామేష్టి యొనర్చి మంత్రసిద్ధమైన పాయసము మహిమచేఁ దుదికిఁ పుత్త్రునిం గాంచెను. ఆతనిపేరు సహస్రానీకుఁడు. తండ్రికిం దగ్గ తనయుఁడై వంశమునకుఁ బేరు పెంపులు తెచ్చు రత్నమై రాజులలోఁ దేజు కల మానిసియై వెలయు ఆ కుమారుని యువరాజుగా నభిషేకించి నిచ్చలు శతానీకుఁడు భోగపరాయణుండై కాలము గడపుచుండెను.

అంతఁ గొంతకాలమున కమరావతిలో దానవులతోడి సంగ్రామము సంభవింపఁ దొడుసీడగా నుండఁగోరి మహేంద్రుఁడు శతానీకుని దెబ్బని రాయబార మంపెను. అది విని శతానీకుఁడు ధురంధరుఁడైన యుగంధరుఁ డను మంత్రిసత్తముని చేతిలోఁ బుత్త్రికు నొప్పగించి రాజ్యమునకు వలసిన సర్వ సంరక్షణమ్ములు సిద్ధపఱిచి దానవ సంహారమునకై నాకము తరలిపోయెను. అయ్యెడ నా ఱేఁడు దేవేంద్రుని సత్కారములు పడసి దేవదానవుల పోరిలోఁ దానును యోధుఁడై చెలరేఁగి యసురులను బెక్కురను సంగ్రామ రంగమున కాహుతి సేసి, తుదకిఁ దానె డస్సి యసువులు వాసెను. దానికి సురేంద్రుఁ డెంతయుఁ జింతించి మాతలిచే భూతలమున కాతని దేహము పంపెను. వాని శుద్ధాంతమా విషాద వార్తకుఁ దద్దయు వగచి యనుగమనము కావించెను.

పదపడి సహస్రానీకుఁడె సామ్రాజ్య భారమును భుజస్కంధమున మోపి నేల నాల్గు చెఱంగులఁ గీర్తిలతావితానమును బ్రోదిసేసి నిర్వక్రపిక్రమంబు నివ్వటిల్ల సామంత భూకాంతులు పాదాక్రాంతులు కాఁగా రాణ వహింపఁ దొడంగెను. ఆతని యేలుబడిలో నిచ్యకల్యాణము పచ్చతోరణమై నిఖిల ప్రజానీక మానంద సందోహమున మునిఁగి తేలెను. ఒక్కనాఁడు మహేంద్రుఁడు శత్రుజయోత్సవము సేయఁబూని మిత్త్రుని పుత్త్రుండైన సహస్రానీకుని స్వర్గమునకు రావించుకొనెను. అయ్యెడ నా రాజు నందనోద్యానమున విహారములు సలుపుచు నాటలఁ బాటలఁ గాలము పుచ్చు

వచ్చుటలంజూచి దేవతావర్గములోఁ దానును దివ్య వైభవములం దనరారియు నవివాహితుం డగుటను మనమునఁ జింతపడసాగెను. అయ్యది సురేంద్రుఁడు మదిలో నెఱింగి యాతనిం జూచి యిట్టులు వచించెను. ఓయీ రాజా! విచారింపవలదు. నీకోరిక చక్కఁగా నెఱింగితిని. నీకు ననురూప యగు భార్య భూలోకములోఁ బుట్టియున్నది. ఇందొక గాథ యున్నది. విందువేని వివరింతును వినుము.

మున్ను బ్రహ్మదేవుని సభలో నొక దృశ్యము కంటిని. విధూముఁ డను వసు వొక్కఁడు బ్రహ్మదేవుని సేవింప నయ్యెడ కరుదెంచి ప్రాంతమున సంచరించు-అలంబుష యను నచ్చర లేమను గాంచి మోహించెను. ఆపె చూపులును వాని రూపలావణ్యముల కగ్గమై వింత యనుభావంబు సంతరించె. అట్టిది గుఱుతించి బ్రహ్మయుఁ దలయూఁపిన నేను సమయము చూచి వారి నిద్దారతో—అవినీతులారా! మీ చేష్ట లెఱింగితిమి. ఉభయులు భూలోకములోఁ బుట్టి సతీపతులయ్యెదరు గాక యని యలుక వొడమ వారికి శాపమిచ్చితిని. ఓ సహస్రానీకా! ఆ వసువే నీవై శతానీకునకు బిడ్డగా నవతరించితివి. ఆ యచ్చరయు నయోధ్యలో గృతవర్మ యను ఱేనికిఁ గూఁతురై మృగావతి యనుపేరఁ బరగుచున్నది. ఆమెయే నీకు గాఁగల భార్య.

నా విని యా ఱేఁడు మదనానిలము పెల్లురేఁగి ప్రజ్వలింప నిమేష మొక యుగముగాఁ గాలముగడపి మహేంద్రుని యా మంత్రణంబు వడసి మాతలి యరదము త్రోలుచుండ భూతలమునకు వచ్చుచుండెను. ఇంతలోఁ దిలోత్తమ

యను నప్సరస యాతని యతిలోక సౌందర్యముఁ గాంచి మోహపడి రాజా! ఒక్కమాట. కొంచె మాఁగి విని పొమ్మని వేఁడెను. మృగావతీ పరాయణుం డగు సహస్రానీకుఁ డా మాట చెవినిబెట్టక యట్లే వెడలిపోయెను. ఆతఁడు తన్నుఁ బరాభవించెనని యా భామిని భావించి రాజా! యెవ్వతెను బదింపదిగ స్మరించుచు నా మాట విననైతివో యాబిడకు నీకుఁ బదునాలుగేండ్లు వెడఁబాటు కలుగుఁగాక యని త్వరపడి శపించెను. ప్రయాణసంరంభములో మాతలికి మాత్రమే యా శాపము విననాయెను.

భూలోకము చేరిన యా మానవేంద్రుఁడు మృగావతీ వార్తను మంత్రుల ముందు విశదపఱిచెను. ఆతని యుత్సుకతను గాంచి యుగంధరాది మంత్రిసత్తములు మంతనములు సలిపి కన్నెకోసమయి కృతవర్మ సన్నిధికి రాయబారము నడపిరి. ఆ ఱేఁడును రాజేంద్రుని యాప్తితంబు లెస్సగ నామతించి భార్యయుం దాను బిల్ల నిత్తుమని కబురు పంపెను. సరియని యెల్లరు వైవాహిక క్రియలకుఁ గడంగిరి. ముద్దుముచ్చటలు తీఱ మృగావతీ సహస్రానీకుల పరిణయ మహోత్సవము లోకుల కెల్లరకు మురిపము సమకూర్చెను. అందచందములలో నానుకూల్యము వెలయ సౌందర్యుల గుణగణములచే సౌందర్యులు భాసిల్లుచుఁ బ్రజ్ఞాశ్రుతముల సంగతి వోలె నా రాజదంపతులు విరాజిల్లిరి.

ఆవలఁ గొన్నాళ్ళకు సహస్రానీకుని సచివుఁడగు యుగంధరునకు యౌగంధరాయణుఁడును సేనాని యగు సుప్రతీకునకు రుమణ్వంతుఁడును నర్మసచివుండైన మిత్త్రునకు

వసంతకుంభును జనించిరి. కాలక్రమమున మృగావతియు గర్భవతి యాయెను. కాంతునిప్రేమాల ముదంబునం బొదలుచు గర్భభరాలసయగు నాపెను తెప్పవాల్పక తనివితీఱక వల్లభుఁడు కాంచునెడ - నెత్తురుతో నిండిన దీర్ఘికలో స్నానమాడను గోరిక కలదని యామె ముచ్చటించెను. ధార్మికుఁడైన యాఱేఁడు నెత్తురు మాటకుఁ జిత్తమున తత్తఱిల్లఁ గాదని యునలేక లత్తుకరసము మున్నగువానిని బావిలోవైచి చూపఱకు నెత్తురే యన్నట్లు సర్వము సిద్ధము చేయించెను. మృగావతియుఁ గోరిక లీరికలెత్త సవిలాసముగ నయ్యెడ స్నానమాడునపు డొకానొక గరుడపక్షి రివ్వునఁ బాఱివచ్చి మాంసభ్రమముచే నామెను దన్నుకొని యట్టె పైకి నెగిరిపోయెను. ఎట్టయెదుట బెట్టిదముగఁ జూపట్టిన యిట్టి యాపత్తునకు భూకాంతుఁడు నివ్వెఱపడి చేష్టలుదక్కి నేలమీఁద బిళ్ళబీటుగ బడిపోయెను. కొంత తడవునకుఁ దెప్పిఱి కొయ్యబాఱిన మోముతో బేలయై కూలియున్న యాఱేని సన్నిధికి మాతలి యరుదెంచి తిలోత్తమా శాపవృత్తాంత మంతయు దెలియఁజెప్పి యూఱడించి వెడలిపోయెను. ఆ వార్త వినులం జొచ్చియుఁ బ్రియానురక్తుఁడగు నాతఁడు నెవ్వగం గూరి బిట్టు విలపింప మంత్రులు హితులు హితోక్తులం గొంతవట్టు స్థైర్యము కూర్పఁ బ్రియా పునస్సమాగమ కాంక్షను ఱేఁడు ప్రాణములు నిలుపుకొని కాలము గడపుచుండెను.

అప్పుడు గరుడుఁడు మృగావతిని రివ్వునఁ గొనిపోయి మానిసియని తెలిసికొని దైవికముగ నామెను ఉదయ పర్వతముమీఁద విడనాడి యెందే నరిగెను. శోకభయాక్రాంత

యగు నా కాంత యేకాంతమున దిక్కు మ్రొక్కును గానక పదింబదిగ విలపించు నత్తఱిఁ గొండచిలువ యొండు తిండికై యామెను మ్రింగవచ్చెను. ఆమె భాగ్యము మంచిది గాఁబట్టి సమయమునకు దివ్యపూరుషుం డొక్కరుఁడు చెచ్చెఱ నచ్చటికివచ్చి యా పాఁపఱేనిం జంపి యంతర్ధానుఁడాయెను. జీవితమునకు రోసి యా మానవతి ప్రాణత్యాగమునకు సిద్ధమై యచ్చోట నడగొండవోలెఁ దిరుగాడు మత్తేభము నొక్కటింగాంచి దాని ముంగాళ్ళ ముంగల గ్రక్కునఁ బడెను. పరమేశ్వర ప్రసాదమునఁజేసి ఘాతుక జంతువు సైతము దయచూపి యామెను గాపాడెను. తుది కయ్యా దియు సైఁపఁ జాలక యసువులు పాయుటయే జీవితభాగ్య మని గాఢముగ నమ్మిన యామె కొండనుండి క్రిందికి దూఁకుటయే మేలని తలంచి పతిని సంస్మరించి యెలుంగెత్తి యేడ్వసాగెను.

సమయమునకు సమీపమునఁ దిరుగుచున్న ముని కుమారుఁ డొక్కఁడు మృగావతీ రోదనమును విన్నవాఁడై మూర్తీభవించిన శోకదేవతయో యన జాలిగొలుపు నా భామిని గాంచి గుండె కరఁగి యామెదరిఁజేరి మంచిమాటలు చెప్పి యూఱటఁ గూర్చి యొయ్యన జమదగ్ని యాశ్రమముం జేర్చెను. అచ్చట దివ్యతేజమున వేవెలుఁగువోలె వెలుంగు చున్న యా మహర్షివర్యు నా మృగావతి గాంచి యాయన యడుగుఁ దమ్ములకు మ్రొక్కెను. తపస్వియుఁ దపస్విని యగు నామెను బ్రేమారఁ జూచి దివ్యదృష్టితో నామె భావిచరిత్రము గుఱుతించి అమ్మా! విచారింపవలదు. నీ

కడుపున వంశవర్ధనుండగు పుత్త్రుఁడు పుట్టును. భర్తృసమాగమము సైతము తప్పక కలుగునని యాదరించి యామెను దన యాశ్రమమందే కాపాడుచుండెను.

## ఉదయనుని జన్మము

ఎల్లరి యాదరమున నయ్యెడ మృగావతి సుఖముగఁ గాలము గడపుచు దుఃఖము మఱచిపోయెను. నవమాసములు నిండిన యామెకు సుముహూర్తమందుఁ గుమారుఁడుదయించెను. ఆకాశవాణి యిట్లని యప్పుడు వినిపించెను:— ఈతఁడు సిరిసంపదలందులఁదూఁగి కీర్తికాంత వరింపనున్న జగజ్జేగీయమానుఁడగు చక్రవర్తి. ఈతనిపేరు—ఉదయనుఁడు. ఇతని కడుపునఁ బుట్టువాఁడు సకల విద్యాధరులకు సార్వభౌముఁ డగును.

క్రమముగా నా బాలకుఁ డాశ్రమమందే జమదగ్ని కృపావిశేషమున సర్వవిద్యలు ధనుర్వేదము సాంగోపాంగముగ నేర్చి సద్గుణముల గనియై చక్కఁగా నెదుగుచుండెను. ఒక్కనాఁ డాతని తల్లి తన కేల నున్న కడియముం దీసి బుడుతని చేతికిం దొడిగెను. అందు సహస్రానీకుని నామాక్షరములు పొందికగాఁ జెక్కఁబడెను. ఉదయనుఁడు వేఁటవోయి యొకప్పు డడవిలోఁ దిరుగుచుండ నొక్కెడ నొక్క బోయవాఁడు బలాత్కారమున నొక్క పెనుబామును బట్టుట కాననయ్యెను. దాని యందచందములం గని యుదయనుఁ డబ్బురమును బొంది జాలియుఁ బూని యోయీ! దానిని విడిచిపెట్టుమని గట్టిగ మందలించెను.

శబరుండును వినయము చూపి మహాప్రభూ! ఇది నా నిత్య ప్రవృత్తి. పైఁగా నేను కడుంగడు పేదను. పాముల నాడించి బ్రదుకుటయే నా మనుగడ. ఈ కాఱడవిలో వెదకి వెదకి మంత్రౌషధి ప్రభావముచే నిట్టిదానిఁ బట్టుకొంటిని. మును పున్న పాము చచ్చిపోఁగా దీనిని బట్టుకొని జీవిక చూచుకొన నున్నాను. అని దీనముగ వేఁడుకొనెను. వదాన్యుఁడైన యుదయనుఁడు చేతికడియ మాతనికిచ్చి బ్రదుకుమని పలికి పామును విడిపించి వానిం బంపెను. తోడనే యా పాఁప ఱేఁడు రాచబిడ్డకు మ్రొక్కి మిక్కిలిగ సంతసించి రాజకుమార! నా మనవి వినుము. నేను వాసుకి యన్నను. నన్ను వసునేమి యందురు. నన్నుఁ గాపాడిన నీకు నే నెంతయు ఋణపడితిని. ఇవిగోఁ గైకొమ్ము, అని దివ్యనాద మనోజ్ఞం బగు వీణను – వాడిపోవని పూదండను – దాంబూలపుఁ దీఁగలను – దిలకమును వినయముగ సమర్పించెను. అవి గైకొని యుదయనుఁడు వసునేమి తన్ను మోసికొనిపోవ నాశ్రమము నకుం జని తల్లి కన్నులకు ముచ్చట కూర్చెను.

ఇయ్యెడ బోయవాఁడును దన భాగ్యమునఁ జేసి లభించిన కడియముం గొంపోయి యంగడివీథిలో నమ్మఁ జూపెను. అందు సహస్రానీకుని పేరు కాంచి రాజోద్యోగు లాతనిని బట్టుకొని దివాణమునకుఁ జేర్చిరి. కొలువులో సహస్రానీకుఁ డా కడియముం గాంచుచునే శోకపరీతహృదయుండై శబరుని బిలిపించి దాని కథ యడిగెను. వాఁడును బూసగ్రుచ్చినట్టులు కాఱడవిలోని గాథను విన్నవింప మహారాజా కడియము తన ప్రాణేశ్వరిదని భావించి బిట్టుగ

వగవసాగెను. అంతట నాకాశవాణి రాజా! నీ శాపము తొలఁగినది. నీ ధర్మపత్ని మృగావతి బిడ్డతోఁగూడ నుదయాద్రియందు జమదగ్ని యాశ్రమములో నున్నది. అని వినిపింప విరహాకాతరుండైన యా రాజేంద్రుఁ డద్దాని కెంతయు సంతసించెను.

మఱునాఁడు ఱేపకడ మేలుకని సహస్రానీకుఁడు సత్వరముగఁ బ్రయాణమై పవిత్రమైన జామదగ్న్యాశ్రమము చేరి మహనీయు నా మహర్షిని దర్శించి తద్దయు భక్తి ప్రపత్తులు చూపి వచ్చిన కార్యము విన్నవించెను. ఆయన యతనికి నతిథి సత్కారము లుపచరించి యాశ్రమవాసు లెల్లరు ముదంపడుచుండ మృగావతిని బిడ్డతోపాటు రావించి దివ్యోపదేశము గావించి వారి నాతని కొప్పగించెను. ఆ దంపతుల శాపాంతమందలి సందర్శన ఘట్టము చూపఱకు నేత్రానందమై నడచిన సంభాషణము శ్రవణానందమై యాయున్న యునికి యాకర్షణీయమై యెంతయు రాణించెను. పదపడి సహస్రానీకుఁ డాశ్రమవాసులకు జోతలు సలిపి జమదగ్ని సన్నిధిని సెలవు గైకొని భార్యాపుత్త్రులుం దాను బట్టణమునకు బయలుదేఱఁ బౌరజనులు గుములు గట్టి కడుంగడు దవ్వు నెదురుగా వచ్చి కనుదమ్ములతోఁ ద్రాగువారువోలె నమ్మువ్వురను ఱెప్ప వాల్పక తనివి తీఱక చూచుచుండ నగరు చేరెను.

నిరవధికంబగు సంతోష సాగరమున నోలలాడిన సహస్రానీకుఁడు కుమారుని సుగుణ పుంజములకు మురిపమంది యాతనిని యౌవరాజ్యమం దభిషేకించి యమ్మహోత్సవములో మంత్రుల కుమారులైన యౌగంధరాయణుని

రమణ్వంతుని వసంతకుని మంత్రులనుగా నిర్ణయించెను. సచివోత్తముల సాయమున నీతఁ డఖండ భూమండల మేలు నని దివ్యవాణి పలికెను. దశదిశలలోఁ బూలవాన వింతగాఁ గురియఁ జొచ్చెను. దేశము మిక్కిలియుఁ బ్రకాశమాన మయ్యెను.

కాలక్రమమున సర్వ సౌఖ్యములు చవి చూచిన సహస్రానీకుఁడు విషయస్పృహలు విడనాడి నిత్యకల్యాణ శోభితుం డగు కుమారునకుఁ బ్రాజ్యసామ్రాజ్య మొప్పగించి భార్యయుం దాను భద్రప్రాప్తికై హిమాలయ ప్రాంతమునకు మహాప్రస్థాన మొనర్చెను.

౨

పితృదత్తమైన సర్వసామ్రాజ్యము నలవోకగా నేలుచు ఉదయన మహారాజు వత్సరాజని దేశము పిలుచుకొన మంత్రులు సామంతులు హితులు పురోహితులు నిచ్చలు గొలుచుచుండ సింహపీఠిని వెలయుచుండెను. వీణ చేఁబూని యాతఁ డించుక పలికించు నేని జంతుజాలము సైతము మనసు కరఁగి రాపడి యట్లై నిలిచిపోవును. రాజనీతి విద్యలోఁ బారంగతుఁడైన వత్సరాజు ధర్మాది శాస్త్రములు కావ్య నాటక విధానము సంగీతకళా నృత్తనైపుణ్యము లెస్సగా నభ్యసించి యఱువది నాలుగు కళలలో ననువగు ప్రతిభా విశేషమును రూపించుచు జగన్మోహనుండై ప్రకృతివర్గమున కనురక్తుండై ప్రజలను బాలించుచుండెను.

ఉపధాశుద్ధు లగు యౌగంధరాయణాది మంత్రులు పరిపాలనలో మెలఁకువగలిగి జేనికిం జింత యావంతయుఁ గలుగనీయక యెుక్క మనస్సుగా రాజకార్యములు నెఱపుచుఁ బ్రజలకు రాజునకు విశ్వాసపాత్రులయి యరివీర భయంకరులై రాజ్యమున కభ్యుదయంబు కూర్చుచుండిరి. అద్దాన నుదయనుఁడు రాజ్యమునూట యెత్తక కేవలము భోగపరాయణుండై వీణను ఘోషవతిని వాయించుకొంచు నిచ్చలు వేఁటలో మునిఁగి తేలుచు వీణానినాదమున కగ్గమైన యడవి యేనుఁగులను బట్టి కట్టి తెచ్చుచుఁ గాలము వినోదముగాఁ బుచ్చుచుండును. కులరూప వయోవిశేషములలో ననుకూలవతి యగు నిల్లాలికై యాతని మనస్సు పరిపరివిధములఁ బనిచేయుచుండెను.

## మహాసేనుని ప్రభావాదికము

ఆ కాలమున భూలోకములోఁ బేరువడసిన మఱియొక పట్టణము ఉజ్జయిని. అందలి మేడల ధావళ్యము స్వర్గమును నవ్వుచుండెనో యన్నట్లు చెన్నుమీఱి చూపఱకు వింతగొలుపుచుండును. పరమేశ్వరుఁడు మహాకాళ స్వరూపమును దాలిచి కైలాస నివాసమును సైతము కాదని పౌనాఃపుని యుజ్జయినిలోఁ గాపురముండును. మున్ను మహేంద్రవర్మ యను రాజేంద్రుఁ డానగరము నఖండవైభవముతో నాఖండల సంకాశుఁడై చిరకాల మేలెను. ఆతని పుత్త్రుఁడు జయసేనుఁడు. వాఁడును గులమునకుఁ బేరుదెచ్చిన దొడ్డజేఁడు. వాని కుమారుఁడు మహాసేనుఁ డను చక్రవర్తి. ఆతఁడు వత్సరాజునకు సమకాలికుఁడు; ప్రతిస్పర్థియు.

నిత్యము మహాసేనుఁడు మహాకాళుని దర్శించి పూజా పురస్కారములు ముగిసిన పిదప రాజకీయములు చూచుకొనును. అనువగు కత్తియు ననుకూలవతి యగు పత్నియుఁ బడయగోరి యా రాజేంద్రుఁ డొకనాఁడు వింధ్యవాసినీ దేవాలయమున కేఁగి దేవిని దర్శించి నిరశనవ్రతముం బూని చిరకాల మారాధించి తన దేహమునే కోసి దేవికి హోమము చేసెను. అప్పుడు చండిక ప్రసన్నయై రాజా! నీభక్తికి మెచ్చితిని. ఇదిగోఁ బుచ్చుకొమ్ము; ఖడ్గము నిత్తును. అనుపమాన మగు దీని మహిమచే నరివర్గమున కజయ్యుఁడవై లోకమున రాణింతువు. అదియునుగాక - అంగారకుఁడను నసురవరేణ్యుని కూఁతురు - అంగారవల్లియను త్రిలోకసుందరి నీకు ధర్మపత్నియై పరఁగును. ప్రచండమైన సాహసకృత్యమును గావించితివి గావున జండమహాసేనుఁడని బిరుదనామము వహింతువు. అని పలికి కత్తియిచ్చి యంతర్థాన మాయెను.

చండమహాసేనుఁడు ఖడ్గబలముచే నఖండకీర్తిని గడించి రాజ్యమేలుచు నొక్కనాఁ డడవికి వేఁటవోయి యందందుఁ దిరిగి తిరిగి మృగయా విహారము కావించెను. ఒక్కెడ నడగొండవోలె నడవిపంది యొకటి బీతు గొలుపుచు ఱేని కెదురై యాతని కఱకుటమ్ములకు లొంగక యాతని యురదంబు విఱుగఁగొట్టి చెచ్చెరఁ బాఱి యొక గుహలో దూఱెను. ఱేఁడును రథంబుడిగ్గి వరాహము వెంటఁ దఱుముచు చాపమాత్ర ద్వితీయుఁడై గుహలో దూఱిపోయిపోయి యొక్కెడ మిక్కిలి మనోజ్ఞమైన పట్టణముం జూచెను. చూచి

దానికి ఱిచ్చవడి యచ్చట నొక్క దీర్ఘిక చెంతఁజేరి కూరు చుండెను. ఇంతలో నొక్క యింతి నూఱుగురు చెలిమికత్తెలు చుట్టునుంబలసి కొలువ మదనాస్త్ర మోయనఁ జూపఱకు నింపుగొలుపుచు మెల్లమెల్లగా తనిదరిఁ జేరి తెగువ మీఱి యెవ్వఁడవు నీవు ? ఇందేల వచ్చితి వని ప్రశ్నించెను. ఆతఁడును దన్ను దాఁచక యెఱింగించి జరిగినది వివరించెను. అప్పుడు ధైర్యము తూలి యా కన్నెమిన్న కనుదోయినుండి బాష్పము లురల బిక్కమొగము వైచెను. ఎవ్వతెవు నీవు ? ఏల యేడ్తువని ఱేఁడు ప్రశ్నింప నా కన్నెయు వలపుఁగొలుపు నాతని చెల్వునకు లోఁగి యిట్లు పలికెను — ఆర్యా ! నీవు వెంటఁబడి తఱిమిన వరాహము — అంగారకుఁడను రాక్షసుఁడు. ఆతఁడు శాపదగ్ధుండై వెడలిన యొక మహావీరుఁడు. నేను వాని కూఁతురను. అంగారవతియని నన్నుఁ బిలుతురు. అమిత విక్రముండైన యా యసుర వసుంధరాపతుల శుద్ధాంతములనుండి యీ యున్న నూఱుగురు రాచకన్నెలను బలవంతముగాఁ బట్టి తెచ్చి నాకుఁ బరివారముగా నేర్పఱిచినాఁడు. బడలికచే నొడలు మఱచి యుండుటఁ జేసి చేతికిఁజిక్కిన నిన్ను విడనాడి వరాహరూపమును మాని విశ్రమించి యున్నాఁడు. మేలుకని యావల నిన్నుఁ దప్పక పట్టను బెట్టుకొనునని తోఁచి యమంగళము స్ఫురించి కుములుచున్న దానను.

నా విని మహాసేనుఁ డావంతయు సంశయింపక నాయెడ నీకు నెయ్యము కలదేని — ఇదిగో — ఈ చెప్పినట్టులు చేయుము. ఆతఁడు మేలుకొనునప్పు డెదురుగాఁ బోయి

యేడువుము. దానికిఁ గారణ మాతఁ డడుగఁ దండ్రీ! నిన్నెవరైనఁ జంపిరేని నాగతి యేమి! యని యడుగుము. అప్పుడు నీకును నాకును దప్పక మేలు కలుగును అని పలుకఁగా నామెయు వల్లెయని యపాయమురాకుండ వాని నెచ్చోటనో దాఁచిపెట్టి యట్టె తండ్రియొద్ద కేఁగి యాతఁడు మేలుకొనుడు తాను పెద్దపెట్టున నేడువసాగెను.

తండ్రి:— అయ్యో! ఎందులకమ్మా యేడ్చెదవు ?

కూఁతురు:— తండ్రీ! నిన్నెవ్వరైనఁ జంపిరేని నాగతి దుర్గతియే గదా! అది మనసునకు వచ్చి కుమిలి కుమిలి యేడ్చుచున్నాను.

తండ్రి:— పిచ్చితల్లీ! ఎవఁడమ్మా నన్నుఁ జంపునది! నా యొడలంతయు వజ్రమయము గాదా! ఎడమచేతిలో నొక్క రంధ్ర మున్నది. దానిని నా ధనుస్సు కాపాడుచుండఁగా నా కేమి భయము! నా కెట్లు మరణము!!

అని యా దానవుఁడు కూఁతు నోదార్చి లేచి స్నానసంధ్యాదికములు కావించి మానము పూని శివపూజకు సిద్ధమాయెను. మహాసేనుఁడా యసురుని యాయువుపట్టు మాటపొంచియుండి విని సంతసించి వింట బాణము సంధించి రివ్వున వాని యెట్టయెదుటికి వచ్చి యుద్ధమునకుఁ బిలిచెను. మౌనమందున్న దానవుఁడు తాళుమని యెడముచేయి యెత్తి సైగఁ జేసెను. వెంటనే ఱేఁడు హస్తలాఘవమును నెఱపి యసుర చేతిలోని యాయువుపట్టును గుఱిచూచి కొట్టెను. వెల్లుగ నా రక్కసుఁడు గర్జిల్లుచు విలవిల తన్నుకొనుచు నోయీ!

డప్పిగొన్న నన్నుఁ గూల్చితివిగాన నేఁటేఁట నీటితో నాకుఁ దర్పణము సేయుము. కాదేని నీ యయిదుగురు మంత్రులు నశింతురని పలికి ప్రాణములు విడిచెను.

ఆవల వాని కూఁతు నంగారవతిని నుజ్జయినికిఁ గొంపోయి మహాసేనుఁడు వివాహమాయెను. క్రమముగా నా దంపతులకు గోపాలకుఁడు పాలకుఁడు నని కుమారు లిర్వురు పుట్టిరి. వారి పుట్టుకలకు రాజు పొంగి యింద్రోత్సవము గావించెను. ఇంద్రుఁ డందులకు మెచ్చి మెప్పుగా జేని కలలోఁ గానవచ్చి రాజా! త్రిలోకసుందరియగు కూఁతురు నా ప్రసాదమున నీకుఁ గలుగునని ముచ్చటించెను. అట్లే కొన్నాళ్ళ కాతనికి — అందాల రాశియగు కూఁతురు జన్మించెను. ఆమె కడుపున మన్మథుఁడు పుత్త్రుఁడుగాఁబుట్టి విద్యాధర చక్రవర్తి యగునని దివ్యవాణి వచించెను. వాసవుఁ డొసంగుటం జేసి యామెకు వాసవదత్త యని పేరు వెట్టిరి.

నానాఁటికి వాసవదత్త జవ్వనపు మిసిమి గలిగి — అతిలోక సౌందర్యముచే నఖిలావనిపతులకు స్పృహణీయమై యలరారు చుండెను. ఉదయనుఁడు చారుల మూలమున నామె యందచందము లెఱిఁగి ధర్మపత్నిగాఁ బడయఁ గోరియు మహాసేనుని దర్పము గుఱుతించి యింగిత మెఱింగింపక యట్టె కాలము చూచుచుండెను. ఆరూఢ యౌవన యగు వాసవదత్తకు వరుని నిర్ణయింప నేరక తల్లియుఁ దండ్రియుఁ బెల్లుగ దురపిల్లి యొక్కనాఁడు మహాకాళు నారాధించి సన్నిధానమున నిలిచియుండ దివ్యవాణి యిట్లని వినవచ్చె —, ఓహో! దంపతులారా! కులములో రూప

ములో విద్యలో విక్రమములో మహావిఖ్యాతి నంది యాయు
రారోగ్య భోగభాగ్యము లవ్వారిగాఁ గలిగి సచివోత్తము
లాప్తులై పరఁగ మిక్కిలి యొప్పారు రాజకుమారుఁడె మా
బిడ్డను గొంపోయి హాయిమెయిఁ జెట్టవట్టును. అది విని
యట్టి గుణసంపన్నుఁ డీ భూమండలములో నెవ్వఁడా యని
దంపతులు డెంద మాందోళన మొంద నుత్కంఠతో నను
క్షణము విచారించుచుండిరి. అట్టివాఁడు వత్సరా జొక్కఁడే
యని మహాసేనుఁ డెఱుంగును. కాని వానికి వీనికి బద్ధవిరో
ధము కావుటను వాఁ డల్లుఁడుగాఁ గుదురుటకు మనసు
నిలువదయ్యె.

ఒక్కనాఁడు మహాసేనుఁడు మంత్రులతో ముచ్చటిం
చుచు వత్సరాజును బట్టి బంధింప నుపాయములు పన్నియు
సామాద్యుపాయముల కాతఁడు సాధ్యుఁడు కాఁడేమో యని
సంశయించెను. ఐనను జూతమని దూత నొక్కని రావించి
ఓయీ! నీవు వోయి వత్సరాజుతో నా మాటగా నిట్ల
నుము — గాంధర్వవిద్యలో నా కూఁతురు నీకు శిష్యగా
నుండఁ గోరుచున్నది. మాయెడఁ బ్రేమము కలదేని నీ
విచ్చటికి వచ్చి యయ్యది నేర్పవలెనని మా విన్నపము.
అది శిరసావహించి యా దూత వైశమ కౌశాంబికిఁ బోయి
వత్సరాజున కా సందేశము విన్నపించెను.

వత్సరాజు చండమహాసేనుని సందేశము విని యుగ్ర
మనస్కుండై యౌగంధరాయణుని బిలిచి దాని వినిపించి
యింతటి గర్వముతో నా కీ సందేశము పంపిన యా దురా
త్ముని భావ మేమై యుండునో యని ప్రశ్నించెను. ప్రభుభక్తి

పరాయణుఁడును మహా మేధావి యగు మంత్రివర్యుఁ డిట్లని పలికెను:— దేవ! నీవు వ్యసనాసక్తుండ వని లోకు లందఱు తలంతురు. దాని ఫలితమే యిప్పుది. మహాసేనుఁడు స్త్రీ లోలునిగా నిన్నెన్ని, కన్యారత్నము మూలమున ఆశ వెట్టి లోఁగొని చెఱలోఁ బెట్టను దలంచుచున్నాఁడు. స్వామీ! వెయ్యేల! వ్యసనముల జోలి మానుకోవలెను. దీని విని వత్సరాజు వచ్చిన దూతతో నోయీ! నీ ఱేని కూఁతునకు గాంధర్వము కావలె నేని ఆ కన్నె నిచ్చుటికే పంపవలెనని యాతనితోఁ జెప్పుమని ప్రతి సందేశ మంపెను. కాని యప్పటికి నక్కసు తీఱక మహాసేనుని బట్టి తెత్తునని మహాక్రోధమున మంత్రులతోఁ బలికెను. దానికి యౌగంధ రాయణుఁ డొల్లక మహాసేనుని మహామహిమము సమగ్రముగ వర్ణించి వాని యాభిజాత్యము వివరించి వెండియు నిట్లనియె — దేవ! ఆతనిని బట్టితెచ్చుట భావ్యము కాదు; సాధ్యమును గాదు. నీవంటి మహాచక్రవర్తి కాతని వియ్యము శ్రేయము గాని కయ్యము న్యాయముగాదు. తన కూఁతు నీకీయఁ గోరి యీ పన్నుగడ పన్నియుండును. ఆమె నీకు ధర్మపత్ని యగుట వత్సదేశము నోము ఫలించినట్లె. ఉభయుల బాంధ వ్యమునఁ జేసి యుభయ దేశములు పెంపు వహించును.

నా విని వత్సరాజు సరియే మాటయని యుంకించి తల పంకించి యప్పటి కా యత్నము మానుకొనెను. కాని వాసవదత్తా లావణ్య వృత్తాంతము వాని హృదయము నూచముట్టుగ దోచివైచెను.

## 3

మహాసేనుని దూత ప్రతిసందేశ మందుకొని యుజ్జయినికి వచ్చెను. ఏకాంతమందా భూకాంతునకు వత్సరాజు పంపిన వార్త విన్నవించెను. దాని కాతఁ డాగ్రహపడక యొకవిధముగ సంభావించి యిట్లని చింతించె — అతఁడు పరువుగల మానిసి. ఇచ్చటి కాతఁడు రాఁడు. బిడ్డ నచ్చటికిఁ బంపుటయు భావ్యము కాదు. తెలికదనము చూపకయే ఆగ్రహ మొదవింపకయే యుక్తిగా నాతనిఁ బట్టి తెచ్చి యల్లునిగాఁ బడయుటయే యెల్లవిధాల మేలు. అని చింతించి సచివులను బిలిపించి యయ్యది యెఱింగించి పరిశీలింపుఁడని కోరెను. వారును తేనిభావ మూహించి దాని యౌచిత్యము ప్రశంసించిరి. వత్సరాజు వీణాహస్తుఁడయి నిచ్చలు వేఁట తమకముచే నడవిలో నేనుఁగులను బట్టుచు నేకతమ తిరుగుచుంట మహాసేనుఁ డెఱుంగును. అద్దాన నాతనిని యుక్తిగాఁ బట్టి యుజ్జయినికిఁ దెచ్చిన గాంధర్వవిద్యలోఁ దనబిడ్డ కాతఁడు గురువుగా నుండవచ్చు నని యాతని యాశ. ఆవల నిర్వారి హృదయము లవశ్య మనురక్తములై తన్మూలమున నాతఁడు వశ్యుఁడై యుండనోపునని మహాసేనుని తలంపు. ఇట్టిది సమయోచితమైన సదుపాయమని యూతేఁడు నిశ్చయించి మంచి పనితనముచే యంత్రగజము నొక్కటి సిద్ధము చేయించెను. పదపడి దాని కడుపులోఁ బెక్కురు వీరపురుషులను దాఁచిపెట్టి వింధ్యారణ్యములో దానిని నిలిపియుంచెను.

# మృగయా వినోదము

ఉదయనుఁడు వేఁట తమకమున కౌశాంబిని విడనాడి యడవులలోఁ ద్రిమ్మరుచు యమునానదీ కచ్ఛభూముల వేణువనప్రాంతముల నాగవన పరిసరముల సారెసారెకుఁ దిరుగుచు నాయాయి చోటుల గూఢచారుల నేర్పఱిచి యడవియేనుఁగుల రాకపోక లెఱుంగుచుండును. ఒకతూఱి ఆప్తులగు వ్యక్తులు వెంటరా సముచిత పరివారముతో వసంతకుఁడను మిత్త్రునితో వత్సరాజు వేఁటవోయెను. అది వింధ్యారణ్య ప్రాంతము. ఎందుఁజూచినను గజబృందమే. ఆకసమును జుంబించు మహావృక్షముల దరిఁజేరి కొమ్మలు విఱిచి యేనుఁగు తండములు ప్రోవులు వెట్టుచుండును. సెలయేటిధారల నెగఁజిమ్ముచు మనోహరములైన పర్వత సానువులు కన్నుల పండువులు సేయుచుండును. మదపు టేనుంగుల యడుగుల రాపిడికి గైరికాది ధాతువులు పొడి పొడియై నిమ్నోన్నతము లేర్పడఁగా యాగశాలలోని హోమకుండములు వోలె-ఆ ప్రాంతములు రాణింపఁజొచ్చెను.

విచిత్రములై మనోజ్ఞములైన యా యా విశేషములు వత్సరాజు లెస్సగాఁ బరికించుచు గజఘటలను గాంచి గజ గజలాడు విదూషకుండు వసంతకున కూఱట గొలుపుచు నొక్కెడ కొండకొమ్మున జలజలమని ఱాలపై వారలు చల్లని సెలయేటి నీట మెల్లగా దోఁగుచు మార్గాయాసం బపన యించుకొనుచుఁ గమలాకరంబు లందలి జలపక్షుల కలకలా రావములను వీనుల విందుగా వినుచు పండ్లతోఁ బువ్వులతోఁ

గొమ్మలతో రెమ్మలతోఁ జివురులతోఁ జిద్విలాసముగఁ గానుపించు వృక్షరాజ సంతతుల ననంత ముదంబునఁ గాంచుచుఁ బ్రకృతి సౌందర్యమునకు విస్మయంపడుచుఁ గాలము గడపుచుండెను.

అంతలో నొక్కఁడు వనచరుఁడు రివ్వురివ్వునఁ బరుగిడుచు వచ్చి చెమర్చిన నెమ్మొగము వాని మార్గశ్రమము సూచింప నురుగులు గ్రక్కుచు జేనిమ్రోల మోఁకరించి దోయిలించి యిట్లని విన్నవించెను — దేవా! యేలినవారి యానతి యాదల దాలిచి యేనుఁగుల జాడలను జూడ నెల్ల యెడలఁ బెల్లుగఁ ద్రిమ్మరితిమి. ఒక్కచో మదపుటేనుఁగొక్కటి దేవర పాదములాన దివ్యమైన యైరావతము భాతి వింధ్యాచలమే నడచివచ్చిన వడువున మాకంటికి దిగ్భ్రమము బొడమఁ గనులారఁ జూచి వచ్చితిమి. దాని యాకృతి యేమని వర్ణింతుము! ఒడలు చామనచాయ, మొగమున సువాసన, వట్రువయై మిక్కిలి యెత్తైన కుంభస్థలము, బలువై నిడుదయైన తొండము, నుదుటఁ గుంకుమవంటి చక్కని చుక్క. ఏనుఁగుల నడుమ — అడుగడుగునఁ గాలముగడుపు మావంటి యడవి మానిసులకు సైత మబ్బురము గొలుపు — ఆ దొడ్డ యేనుఁగుంజూచి దొరా! చెప్పవచ్చితిమి. అయ్యది భద్రజాతి గజమై యుండవచ్చును. ఆవల దేవర చిత్తము.

అది విని వత్సరాజు మిక్కిలియు సంతసించి వానికి లక్షవరాలు పారితోషిక మొసంగి వెంటనున్న సేనల నచ్చటనే విడియించి యొంటరిగాఁ బోవలదను మిత్త్రులమాట పాటింపక యా ప్రాంతమునకు బయలుదేఱెను. అచ్చటఁ

గాఱడవిలో వనచరుల తోడ్పాటుతో నమ్మదగజము జాడ నెఱుంగను ఘోషవతిని గేలఁబూని ముందునకు నడువనడువ మాయాగజము దవుదవ్వులఁ గానవచ్చెను. తోడనే ఱేఁడు సెలయేటి నీటఁ గాలుసేతులు కడుగుకొని - ఆచమించి ఘోషవతిని సిద్ధపఱిచి గాంధార గ్రామమున గజాకర్షిణి యను రాగము నాలపించెను. గానములో నాతని మనస్సు లీనమగుటను సాయంసమయపుఁ జీఁకటి క్రమ్ముటను వన గజము కాదని వత్సరాజు గుఱుతింపలేదు. కాక మొక్కటి పరుషధ్వని కావించుచు ఱేనిమ్రోల నెడమవైపుగఁ బోవ సాగెను. ఱేనికి నెడమ కన్నదరెను. ఎడమ బాహువు వీణ పట్టు సడలిపోయి యించించుక వణఁకసాగెను. ఎడందలో ఱేఁడు సందియమొందియు ధీరుఁడు కావుటను బెఱుందికిఁ బోక ముందునకు నడచెను. కృత్రిమ గజము చెవులు ఱిక్కించి వచ్చినట్టె దగ్గఱకు వచ్చును. అప్పుడే దొరకక దవ్వుగాఁ బోవును. ఱేఁడును బట్టువదలక ముందునకుఁ గాలువెట్టఁగా నుద్దవిడి వీరపురుషులు యంత్రగజములో నుండి పెక్కురు వెలువడి యుద్ధమునకు సన్నద్ధులై ఱేనిని జుట్టుముట్టిరి. ఔరా! యని యౌడుగఱచి కుఠారము కేలఁబూని వత్సరాజు విజృంభించెను. సంకేతమునుబట్టి తత్ప్రాంతమున మూఁగిన చండమహాసేనుని ప్రచండసేనలు పెల్లుగఁ జెలరేగి యొక్కుమ్మడి నాతనిఁబట్టి బంధించిరి. సాలంకాయనుఁడను సచివాగ్రేసరుని యధ్వర్యవమున మహాసేనుని సైన్యము వత్సరాజును గనుకందనీయక కట్టుదిట్టముగ నుజ్జయినికిఁ గొంపోయిరి.

# కారాగార ప్రవేశము

ఉజ్జయినిలోఁ బౌరజనము వత్సరాజు గుణగణమునం దనురక్తులై పరాభవముచేఁ గళంకితుఁడయ్యె నయనానంద కరుండగు నాతనిఁ గన్నులం జూచిపోవలయునని నలుగడల మూఁగిరి. మఱియు చండమహాసేనుఁ డాతనిం జంపునేమో యని శంకించి యమ్మహారాజుకడకుఁ బోయి వత్సరాజును జంపితివేని యాత్మహత్యయె మాకు శరణ్యమని గట్టిగ ఘోష వెట్టి మొఱవెట్టుకొనిరి. ఓహో! మీకేల యీ తలంపు? వత్సరాజు నాకు వధింపవలసిన వాఁడు కాఁడు; సంధిచేసికొనఁ దగినవాఁడు. మఱియు మీకసమ్మతమైన దెద్దియును గాని నాకు సమ్మతము కాదుగదా! అని యా మహాసేనుఁడు చక్కఁగా మహాజనమునకు బోధచేసి యపార పారావారము ఘోషము ననుకరించు మహాజన కలకలమును నిశ్శేషముగ నివారించెను.

పదపడి వత్సరాజును మహారాజ నివాసయోగ్యమగు మందిరములో నుంచివైచిరి. మహాసేనుఁడు సమయము చూచి వాని సమీపమున కేఁగి తద్దయు నాతని గారవించి యుదారమగు ధోరణిలో నోహో! ప్రభూ! జరిగినదాని కన్యథా భావింపవలదు. ఈమె నా బిడ్డ వాసవదత్త. సంగీత విద్యలో నీమెను సంస్కరింపఁ గోరెదను. ఆవల నీకుఁ గల్యాణమే యగును. మదిలో బెంగ పడవలదు. అని యాతని యంగీకృతి గైకొని వాసవదత్తను శిష్యనుగా నప్పగించెను.

వాసవదత్తను గాంచిన వత్సరాజు హృదయసీమలో మహాసేనునిమీఁది యక్కసు మాయమాయెను. ఇర్వురి

హృదయక్షేత్రములలోఁ బ్రేమాంకురములు పొటమరించెను. ఆమె మనస్సును దృష్టియు వత్సరాజు వైపునకుఁ బోయినవి. సిగ్గుచే దృష్టికిమాత్ర మభ్యంతరము కానవచ్చెను.

అది దారకొని వత్సరాజు సంగీత విద్యాగోష్ఠిలో తాదాత్మ్యంబు పొందుచు గాంధర్వశాలలోఁ గాపురముండి చేతిలో ఘోషవతియుఁ గంఠమున గీతశ్రుతియు నెట్టయెదుట వాసవదత్తయు సర్వదా వినోదకారణములు కాఁగా బ్రహ్మానంద మనుభవించును. ఒక విధముగ కారాగార మయ్యు వేఱొక తీరుగ వినోదభవన మాయెను. ఆతనిఁ బెడఁబాయని రాజ్యేందిర యోయన వాసవదత్త నిచ్చలు వానికిఁ బరిచర్యలు సేయుచుండును.

## యౌగంధరాయణుని యుద్యమము

అచ్చట వత్సరాజుతో వేటకువచ్చిన సేన రాజును బాసి కౌశాంబికిఁ బోయె. ఱేఁడు బంధితుఁ డాయెనని రాష్ట్రమంతటను గగ్గోలు పుట్టెను. ఱేనిమీఁది యనురాగము మిక్కిలి కాఁగా ప్రజానీకము బిట్టుగఁ గోపగించి యప్పుడే యుజ్జయినిని ముట్టడించి రాజును దెత్తుమని కాలు ద్రవ్విరి. రుమణ్వంతుఁడు వారికిఁ జండమహాసేనుని యుద్దండ శౌర్యమును బోధపఱిచి - ఓహో! మిత్త్రులారా! ప్రజలారా! ఆతని సాధింపవలసిన తీరు - ఇది కాదు. బుద్ధిచే సాధింపవలసినది యుద్ధతిచే నయితికాదు. పైఁగా నట్టి కడంకయు మన ఱేనికి సేమము కాదు. అని వారిని వారించి మెల్లగాఁ బంపివైచెను. ప్రధానమంత్రి యగు యౌగంధరాయణుఁడు

ప్రజాసమూహము భావము గురుతించి రుమణ్వాదాదులతో మంతనములు సలిపి యొంటరిగ వారికి నిట్టులు బోధించెను — సహచరులారా! రాజ్యమునకు నేఁడు విషమపరిస్థితి దాపురించినది. ప్రకృతులు వత్సరాజన్నచోఁ బడిచత్తురు. మీరెల్లరు సర్వవేళల సప్రయత్నుల రయి యుండుఁడు. ఱేఁడు లేఁడను భావము పరరాజుల తలలో మొలక లెత్తరాదు. కనుగలిగి రాజ్యమును గాపాడవలయును. వేళకుఁ దగిన పరాక్రమము వెలార్పవలెను. వసంతకునిఁ దోడుగాఁ గైకొని నా బుద్ధిపాటవము మెఱయించి యుదయన మహారాజును విడిపించి తెత్తును. దీని కెదురన్నది లేదు. ఆపదలో బుద్ధివైభవము చూప నేర్చినవాఁడే ధీరుఁడగు మానిసి. నా కడంకకు — అనువుగా ప్రాకారములు బ్రద్దలు సేయు యోగములు సంకెలల నూడఁగొట్టు సర్వసాధనములు — అదృశ్యకరణులు చాలఁగా నేర్చియుంటిని. ప్రజలందఱు భద్రము సుమా! పోయి వత్తునని వారికి హితవు సెప్పి తాను వసంతకునితో నుజ్జయినికిఁ దరలిపోయెను.

మధ్యేమార్గమున వింధ్యారణ్యము చొచ్చి తన యేలికకుఁ జెలికాఁడైన పుళిందకుఁ డను పుళిందరాజు గేహము చేరెను. అచ్చట నాతఁ డొసఁగిన సత్కారము లంది వానితోఁ జెప్పవలసిన యప్పటి మాటలు చెప్పి యా దారిని రానున్న వత్సరాజును సంరక్షింప నమితసైన్యము నచ్చోటఁ గాపుంచి నెమ్మది నెమ్మదిగా నుజ్జయినికిఁ జేరెను. ఆ నగరిలో యౌగంధరాయణుఁడు మహాకాళ శ్మశానమున నివాసము చేసికొనియె. అయ్యెడ — పొలతిండికాండ్రగు బేతాళు

రనేకులు కఠినలుపు నోడళ్ళతో - పొలవలని కంపుతో నటు నిటు తిరుగాడుచు సేవగింపు గొలుపుచు సందడిగఁ గాన వచ్చిరి. అందు బ్రహ్మరాక్షసుం డొకం డీతనిని జూచిన దే తడవుగఁ బ్రీతుఁడయి తనంతఁ దాను నేస్తముగట్టి చనవున నీతనితో మెలఁగ సాగెను. ఆతఁడు చూపిన యుక్తిచే యౌగంధరాయణుం డొక వింత మానిసిగ మారెను. ఒడలు గూని యయ్యె. తల బట్టతల యయ్యె. ముదుసలితనము తొంగి చూచును. వెఱ్ఱిబాగులవాఁడు వోలె వికారముతోఁ జూపఱకు నవ్వు పుట్టించును. సంస్కారమే లేనట్లు - ఒడలు 'తిరుగమూరి' పోయెను. చినిఁగిన గుడ్డపేలికలే మొలమీఁద వ్రేలాడుచుండును. ఆతనికి నిత్యసహచారి వసంతకుఁడు మాత్రమే. వాఁడు సైతము బ్రహ్మరాక్షసుని యుక్తిచేతఁ దొంటి రూపము పాసెను. ఆతనికి నోటినిండుగఁ బండ్లు బండెఁడు. వికారమైన రూపు. బానయుఁబోలె ముందునకు సాగి పొటమరించిన పెద్ద బొజ్జ. ఆపైని బైకిఁ దేలిన నరముల చాళ్ళు.

ఇట్టి మిత్రుని వసంతకుని ముందుగఁ గోట వాకిట నిలువనంపి తానును వికారపు రూపుతోనే యుజ్జయినీ నగర వీథిలోఁ గాలువెట్టెను. గుంపులు గట్టి పిన్నలు పెద్దలు — ఆ వింతమానిసి చుట్టును నీఁగలు వోలె ముసురుచు బిట్టుగ నవ్వుచుఁ గేరింతలు గొట్టుచుఁ జప్పటలు చఱచుచుఁ జేరిరి. వారి వినోదము పెంపునకై యాతఁ డాడుచుఁ బాడుచు నీలలు వైచుచు రాచనగరి దాపునకుఁ బోయి యందలి దేవేరులకు ముచ్చటఁ గొలుపఁ దొడంగెను. ఆనోట

నానోట నీ వెఱ్ఱి మానిసి వింతవార్తలు వాసవదత్తకుఁ జెవిని బడెను. నవయౌవనపు మిసిమిచే మిసమిసలాడు వాసవదత్త గాంధర్వశాలకు సీతనిఁ బిలిపించుకొనెను. అచ్చట సంకెలలతో మహారాజు వత్సరాజు - ఆకస్మికముగఁ గానవచ్చెను. అయ్యో యని కన్నుల నీరు తెచ్చుకొని పిచ్చివాలకములోనే యేలినవాని యుగచాట్లకు లోలోనఁ గ్రుళ్ళి కుతమారి ధీరహృదయుఁడు కావుటను దెప్పిటె విచారము దాఁచుకొని జేనికి సైగ చేసెను. మహాప్రజ్ఞావంతుండు ప్రధానమంత్రి - ప్రభుభక్తిపరాయణుండు నగు యౌగంధరాయణుఁడే వింత వాలకముతో నిచ్చోటికి వచ్చెనని జేఁడు గుఱుతించెను. అప్పుడా యౌగంధరాయణుఁడు యోగవిద్యను బ్రయోగించి రాచకన్నెకు నాపచేటికకుఁ దాను గానరాక జేనికిమాత్రమే కానవచ్చెను అందాక వెఱ్ఱి మానిసితో వినోదించు విలాసినీమణు లాతని యదృశ్యత కచ్చెరువడి ఓసీ! యిదేమే! ఉన్నట్లుండి వెఱ్ఱివాఁ డదృశ్యుఁడాయె. చూచితిరే! అని గుజగుజలు వోవుచు రాపడి నిలిచిపోయిరి. అంతయుఁ దన మంత్రివర్యుని యోగ మహిమమే యని వత్సరాజు నిశ్చయించి వాసవదత్తను బిలిచి సరస్వతీపూజకై యర్ఘ్యము తెమ్మని యప్పుడు పురమాయించెను. ఆమెయుఁ జెలిమికత్తెలతో లేచి యావలకుఁ బోయెను.

సమయము చూచి సత్వరముగ వత్సరాజునకు సంకెలలు పగులఁ గొట్టుటకు వాసవదత్తను లోఁగొనుటకు నిట్టి పట్టి వని యోగము లన్నియు సాంగోపాంగముగ నిచ్చి యిట్లని బోధించెను - దేవా! నీ చెలికాఁడు వసంతకుఁడు

మాఱురూపముతో నిదిగో నిచ్చటికే వచ్చి ద్వారములో – ఆఁగియున్నాఁడు. వానిని బిలిపించుకొని నిచ్చలు నీ చెంతనె బ్రాహ్మణుఁడుగా వాడుకొనుము. నీవన్న వాసవదత్తకు నమ్మకము కుదురుదాఁక వేచి యుండుము. సమయము చూచి ఆవశ్యకమైన సదుపదేశ మిత్తును. అందాక స్వస్థత చెంది కాల మెదురు చూడుము. అని విశ్వసింపఁజేసి వైశమ వెడలిపోయె.

అప్పుడే వాసవదత్త పూజాద్రవ్యములు పుచ్చుకొని జేని సన్నిధికి వచ్చెను. పూజా సమయమున దక్షిణ పట్టుటకు బ్రాహ్మణుఁ డొక్కఁడు – అక్కఱ యాయెను. అందులకు ద్వారమువద్ద నున్న బ్రాహ్మణుని బిలువనంపుమని వత్సరాజు పలుక. సరే యని వాసవదత్త వానికిఁ గబురు పంపెను. ఆకారము వికారమై యేవగింపు నింపుచుఁ గుండబొజ్జతో వసంతకుఁ డచ్చటికి వచ్చి వత్సరాజును జూచి శోకము పట్టలేక – ఆవురుమని యేడ్చెను. -జేఁ డా రహస్యము స్ఫురింపనీయక – ఓహో! బ్రాహ్మణోత్తమా! చాలు నయ్యా చాలు. ఊఱక యేడ్తువేల! నీ రోగము గుర్తించు వెజ్జును బిలిపించి వైద్యము చేయింతును విచారపడవలదు. అందాక నా వద్దనే యుండవచ్చును' అని పలుకఁగా మహా ప్రసాద మని యా బాపఁ డెగిరి గంతువైచి కేరింతలు కొట్టి మిట్టిపడెను. ఆతని వికారపు రూపుచూచి వత్సరాజు ముసి ముసి నవ్వుల తరఁగలలో మునిఁగిపోయెను. అది యెఱింగి యా బ్రాహ్మణుఁడు' బాన నోరు వికారముగాఁ దెఱచి బడ బడ వాగుచు వెడ వెడ నవ్వుచు వినోదము కూర్చెను.

అట్టి యాకృతిలో నున్న యా వింతమానిసిని గాంచి వాసవదత్తయు మాటాడించుకొనుటలో నుబలాటపడసాగెను. అయ్యా! బాపనయ్యా! ఏ విద్యలో నీవు నోరు తిరిగిన వాఁడవయ్యా! అని యెగతాళిగ వాసవదత్త యాతనిని బలుకరించెను. అమ్మా! మోదక ఖాదనములో మొనగాఁడ నమ్మా! యని వాఁడును బదులు వలికెను. అనఁగా నదే విద్యయో దయయుంచి వ్యాఖ్యానింతురా! అని రాచకన్నె నవ్వులాటలగాఁ బ్రశ్నవైచెను. అప్పుడు వాఁడొక కథగా దాని నల్లి యిట్లు చెప్పఁదొడఁగెను — అమ్మా! నా చిన్న తనమ్ములో బహుశ్రుతుఁడైన మా నాయన మోదకములు తిన్నవాని కడుపులోఁ గథలు పుట్టలు పుట్టలుగాఁ బుట్టుకొని వచ్చునని చెప్పినాఁడు. ఆయన లోకజ్ఞుఁడు, పరమపూజ్యుఁడు కావుటను — ఆయనమాట వేదవాక్యముగా నమ్మి యొక మంచి ముహూర్తము చూచి మోదక ప్రియుఁడగు గణాధి పతిని గూర్చి జపించితిని. ఆ దేవర నాకు సాక్షాత్కరించి హస్త మస్తక సంయోగము కావించి వరమును గోరుకొమ్మని దయతోఁ బలికెను. నేనును సంతోషము పట్టలేక పొంగి పొరలి దేవా! నా కడుపులో కుడుము లెప్పుడు నిండుగఁ బడునట్టులు వర మిమ్మని వేఁడితిని. తథాస్తు — అని యను గ్రహించి, ఆ మహా దైవము — అంతర్థాన మందెను. నాటఁ గోలె నేఁటిదనుక దినమునకు నూఱేసి కుడుములు పట్టించు చున్నాను. కుడు మొక్కొక్కదానికి నూఱేసి కథలు ఊరుచుండును. అమ్మా! నిత్యము వినవలతువేని - ఈ విద్యలో నేరుపు చూపింతును. తరువాత మీ దయ.

ఆ ధోరణిలో రాచకన్నె తనకు నచ్చిన వినోదకథలు వానివలన వినిపించుకొనుటకై మోజుపడి నిచ్చలు నగరిలో - ఆ బాపనికి భోజన శయ్యా విధులను సమకూర్పను భృత్యుల కాజ్ఞాపించెను. ఆతఁ డాతీరుగఁ గోటలో సుష్ఠుగ భోజనములు కుడుచుచు హాయిగా మెలఁగుచు వాసవదత్తా వత్స రాజుల ప్రేమాంకురములకుఁ బాదులు త్రవ్వుచు మోహ బీజములకు దోహద మిచ్చుచు వచ్చిన పని చూచుకొంచు తేనికి హృదయశాంతి సమకూర్చుచుండెను.

## ౪

## వాసవదత్తా హరణము

నిత్యము వాసవదత్త గాంధర్వవిద్యలో నభిరుచి ప్రోది చేసికొనుచు వసంతకుఁడు వచించు వినోదకథలకు ముక్కువ పడుచుఁ ప్రొద్దులు పుచ్చుచుండును. క్రమక్రమముగ నామెకు వత్సరాజు పొలకువ యన్న వలపు గోలుప సాగెను. తండ్రిపక్షమువార లన్న నెడమొగము పెడమొగ మాయె. నడుమ నడుమ మహామంత్రి యగు యౌగంధరాయణుఁడు వత్సరాజు సన్నిధికి వచ్చుచుఁ బోవుచు సమయోచితములగు నుపదేశములు కావించుచు వ్యూహములు పన్నుచుండెను.

ఒకనాఁడు యౌగంధరాయణుఁడు - అదృశ్యకరణి విద్యచే వత్సరాజు సన్నిధికి వచ్చి వసంతకుఁడు వినుచుండ నిట్లని విన్నవించెను — మహారాజా! నిన్న మహాసేనుఁడు మాయావిధానమునఁ బట్టి ఖైదు సేయించినాఁడు. పడరాని

యిడుమ లన్నియుఁ బడితివి. మేమును మా యోపినకొలఁది సహస్రాక్షులమై కర్తవ్యమును గుర్తించి మెలకువతో మెలఁగు చున్నాము. చండమహాసేనుని యింగిత మెఱింగితిమి. ఆతఁడు దుర్బుద్ధితో నిన్నుఁ బట్టియుండలేదు. ఇప్పుడు నిన్నాతఁడు మెప్పుగా సమ్మానించి నీకుఁ దన కూఁతునిచ్చి పెండ్లిచేసి మురిపముగా విడిపింపను దలంపుగొన్నాఁడు. నీ కాతఁ డొనర్చిన పరాభవము పరాభవమే. దానికిఁ బ్రతీకారము చేసియే తీఱవలయును. ఆని యనుంగుబిడ్డను వాసవదత్తను స్వయముగా మనము హరించుకొని పోవలెను. అప్పుడుగాని యాతనికి గర్వభంగము కానేఱదు. ఆతఁ డొనర్చిన చేఁతకు నిదియే యనువైన శిక్ష. మన పౌరుషము చూపుటకు నిదియే మార్గము. మహాసేనుని కోటలో మత్తేభములు రెండు గలవు. ఒకటి నడగిరి. రెండవది భద్రవతి. ఇదియే వాసవదత్తకు ముద్దుగాఁ దండ్రి యిచ్చిన కానుక. దీని జవసత్త్వములకు సాటి రాఁదగిన యేనుఁగు - ఆ యొక్క నడగిరియే. అదియును దీనిఁ జూచినచో యుద్ధము చేయనేచేయదు. మరియును దాని మావటీఁడు ఆషాఢకుఁ డనువాఁడు మిక్కిలి రొక్కము మూలమున మన చేతిలోఁ జిక్కియున్నాఁడు. కావున రాజా! వాసవదత్తా సహితుండవై వలసిన యాయుధము చేతఁబట్టి భద్రావతి నెక్కి రహస్యముగా నీ రాత్రియే కదలిరమ్ము. ఏనుఁగు హావభావము లెఱింగిన యీ మావటీనిని దప్పఁ ద్రావించి ప్రయాణము సాగింతుము. ముందుగ నీ మిత్రుఁ డైన పుళిందకుని వద్దకు నేను బోయి యుందును. త్రోవ పొడుగున మిమ్ముఁ గాపాడను వ్యూహ మేర్పఱిచి నిరీక్షించు

చుందుము. అని యౌగంధరాయణుఁడు వసంతకునకుఁ బూర్వాపరములు తెల్లముగా బోధపఱచి తన త్రోవను దాను బోయెను.

అప్పుడు వత్సరాజు విషయమంతయు హృదయములో హెచ్చుగ నాకళింతకుఁ దెచ్చుకొని సాధక బాధకములు సరిగా సమన్వయించుకొని గంభీర మనస్కుఁడై మెలఁగు చుండెను. ఇంతలో వాసవదత్తయు నచ్చటికి కేతెంచెను. ఇద్దరు విస్రంభాలాపములలో మునిఁగిపోయిరి. ఒండొరుల హృదయములలోఁ బ్రేమ తంతువులు బలముగాఁ బెనఁగొనఁ జొచ్చెను. లెక్కకు దేహములు రెండుగాని భావము లొక్కటిగాఁ బరిణమించెను.

మహామంత్రి వచ్చి తనతో ముచ్చటించిన కథ యంతయు వాసవదత్తకు వత్సరాజు వినిపించెను. ఆ ప్రయోగ మున కామెయు తలయూపి ప్రయాణమున కాయితమాయెను. ఆషాఢకుని బిలిపించి సర్వసన్నాహమునకు ముదల యిచ్చెను.

ఆ రేయి దేవతాపూజ యను వ్యాజముచే నేవేవియో కలిపిన సారాయమును మావటివాండ్రకుఁ ద్రావఁ బోయించిరి. అంబారి వేసి యంతయు సిద్ధముచేసి పిడియేనుఁగును బైనమునకు నిలఁబెట్టిరి. వత్సరాజు ఘోషవతిని బుచ్చుకొని మంత్రిపరుఁ డిచ్చిన యోగములచే సంకెలలు త్రెంచివైచి వాసవదత్తయే తెచ్చి యిచ్చిన యాయుధ విశేషమును గేలఁ బట్టి వసంతకుఁడు తానును బిడియేనుంగు నెక్కెను. కాంచన మాల యను నునుంగు నెచ్చెలితో వాసవదత్తయు నా మత్త గజమునే యెక్కి కూరుచుండెను. మావటీనితో నయిదుగురు

మానుసు లీతీరుగ నా రేయి రెండవ కంటికిఁ దెలియకుండ పరమ రహస్యముగాఁ బ్రయాణము సాగించిరి. నడగొండ వంటి భద్రవతి ప్రాకారములు పగులఁగొట్టి – అనువుగాఁ ద్రోవ చూచుకొని నడచుచుండఁగా 'పహారా' యిచ్చు వీర బాహుని – తాళభటుని వత్సరాజు చూపుమాపి సంతోష పారవశ్యమున మైకము గ్రమ్మి యుప్పొంగిన యెడందతోఁ బ్రియాసహితుం డయి యమిత వేగమునఁ బ్రయాణము సేయుచుండెను.

ఇంతలో నుజ్జయినిలో నగరపాలకు లా రేయి దిక్కు మాలి పడియున్న ప్రాకార పాలకుల శవములను గాంచి ఉచ్చ్వడి గుండెపగిలి కొంతవడికిఁ దెప్పిఱి వెనువెంటనె యా వృత్తాంతము ఱనికి విన్నవించిరి. చండమహాసేనుఁడు సత్వ రమె చనుదెంచి యెల్లయెడల వెదకి వత్సరాజు వాసవ దత్తతోఁ బరారి – ఆయె నని యెఱింగెను. అందఱు నివ్వెఱ పడి యారా యనుచు హాతాశులైరి. పట్టణములో గగ్గోలు పుట్టెను. మంత్రులు బిత్తరపోయిరి. అంతిపురిలో నలబలము వెలువడెను. ఱని కుమారుఁడు పాలకుఁడు రివ్వున నడగిరి నెక్కి సాయుధుఁడై వత్సరాజు పిఱుందఁ బడి తఱుముఁ జొచ్చెను.

నడగిరి భద్రవతిని వెన్నంటి వచ్చుచుండ వత్సరాజు నకు పాలకుని సర్వసేనతోఁ బోరు ఘోరమయ్యెను. అపార మగు శత్రుసేనలు వత్సరాజును ఢీకొనియు – ఎదిరింప నయితి గాక పటాపంచలుగాఁ బాఱవలసి వచ్చెను. నడగిరియు బెదరిపోయి భయంకరముగా ఘోష వెట్టెను. వత్సరాజు

గుండె నిబ్బరముతో శరపరంపరలు గురియుచుండ రుమ
ణ్వంతుని సేనయు నుల్లోల కల్లోలమై పొంగిపొరలి నింగి
కంటి వచ్చు సముద్రమువోలె సమయమునకు సమీపములో
వచ్చిపడెను. ఆ యెద్దడికిఁ దద్దయుఁ గలగుండువడి పాలకుని
సేనలు నిశ్శేషముగ విచ్చుముగ్గై కాందిశీకులై పఱతెంచెను.
మహాసేనుని రెండవ పుత్త్రుఁడు గోపాలకుఁడు తండ్రి యానతి
నొదలదాలిచి చెచ్చెఱ సంగరరంగమునకు వచ్చి తమ్ముని
మఱలించి వెనుకకు నడచెను. అప్పుడు వత్సరాజు నిరా
టంకముగ ముందునకు సాగిపోయెను.

ఇంతలోఁ దెల్లవాఱెను. నిర్వ్యాశంకముగ వత్సరాజు
రుమణ్వంతుని సర్వసేనయుఁ జుట్టును బలసి వచ్చుచుండ
వింధ్యారణ్యము చొచ్చెను. అప్పటికి భద్రవతి యనువది
మూఁడు యోజనములు నడచి బిట్టుగ డప్పిగొన్న దాయెను.
అది యెఱిఁగి ఱేఁడు నీరు త్రావుటకై దాని నొక్కచో నాపి
వైచెను. తోడనే భద్రవతి తనివి తీఱ నీరు త్రావి యా
దోసముచే నప్పుడే క్రిందఁబడి విలవిల తన్నుకొని ప్రాణములు
బాసెను. అయ్యో! యని వత్సరాజును వాసవదత్తయుఁ
దద్దయు వగచిరి. ఎల్లరు డిల్లవోయి యేమియుఁ దోఁచక
కన్నీరు గార్చుచు వింతమానసులై చూచుచుండ నాకా
శమునుండి యిట్టులు శబ్దము వినవచ్చెను.

రాజా! విచారింప వలదు. నేనొక విద్యాధర కాంతను.
నన్ను మాయావతి యందురు. శాపదోషముచే నేను — ఈ
రీతి నేనుఁగనై యిప్పుడు నీ కుపకారమే చేసితిని. ఆవల మీ

కడుపునఁ బుట్టు కొడుకునకు సైతే ముపకారమే కావింతును. ఇదిగో - ఈ వాసవదత్త కేవలము మానవాంగన కాదు; దేవాంగన. ఒకానొక కారణమున భూలోకములో నవత రించి నీకు ధర్మపత్ని - అయెను.

అది విని సంతోషించి వత్సరాజు వాసవదత్తతో ముచ్చటించుచు నొయ్యనొయ్యన పుళిందకుని పల్లెకుఁ జేరెను. అచ్చట నాత్మీయు లెందఱో యాతని చుట్టును గుమిగూడిరి. రుమణ్వాదాదుల రాకచే నుదయన మహారాజు హృదయము ముప్పొంగి పోయెను. వలసిన సౌకర్యము లన్నియు రాజమిత్త్రము పుళిందకుఁ డొనర్పఁగా రాజపరి వార మంతయు సంతోష సాగరమున నోలలాడెను. అనంత ముఖంబున వసంతకుఁడు గంతులు వైచుచుఁ గేరింతలు కొట్టుచుండెను. యౌగంధరాయణుఁడు వచ్చి తన ప్రాణము లలో నొక ప్రాణమైన వత్సరాజును గాంచి ముచ్చటపడెను. విశాలమైన వింధ్యారణ్యము సైతము వత్సరాజు పరివార ముచే నిఱుకటము నొంది కళకళ లాడసాగెను. పరిచారికా బృందము మార్గశ్రమ మపనయింపను బెక్కు రీతుల నుపచరించుచుండఁ జెంతనున్న వసంతకుఁ డాత్మవినోదార్థమై యపూర్వకథలు ముచ్చటించుచుండ నుదయన మహారాజు వైభవప్రాభవములకు మురిపపడుచు వాసవదత్త సుఖముగఁ బ్రొద్దులు పుచ్చుచుండెను.

ఇంతలో నుజ్జయినినుండి యొకానొక దూత వచ్చి వింధ్యాంతర వాసియైన వత్సరాజునకు మ్రొక్కి యిట్లని విన్నవించెను. దేవా! చండసేన మహారాజు నాతో నిట్లని

చెప్పి పంపెను. ఆయన మాటలుగా నా విన్నవించు వానిని సావధానముగఁ జిత్తగింపుఁడు.

ఓహో! రాజా! నీవు కావించినది గుర్తించితిమి. వాసవదత్తను స్వయముగా నీవు కొంపోవుట మాకును సమ్మతమే. ఆమీ నెయ్యము కోసమే నిన్ను మా కోటకు రావించితిమి. నీవు చెఱలో నున్నతఱిని మా బిడ్డను మే మొసంగుట నీకుఁ బ్రీతి కాదేమో యని స్వయముగా నీయమైతిమి. అన్యథా భావింపవలదు. నీ కా దుర్దశయుఁ దొలంగినది. యథావిధిగా నామెను నీవు వివాహ మాడవలె నని మా యభిలాషము. కొంచె మోపిక పట్టుము. ఇప్పుడే నా కొమారుఁడు గోపాలుఁడు మీ సన్నిధికి వచ్చి శాస్త్రీయముగాఁ దోఁబుట్టువునకు వివాహ మహోత్సవము కావించి వచ్చును.

ఈ సందేశమునే యా దూత వాసవదత్తకు సైతము నివేదించెను. ఆమెయు ఘోరాంతమైన యా వృత్తాంతమున కెంతయు సంతసించి కొంగ్రొత్తసిగ్గు దొంతఱలు తొలుకాడ నవనవోన్మేషమై తనరారు రసమయ జీవితముతో విరాజిల్లెను. అప్పుడు గోపాలకుని రాకను నిరీక్షించుచు వానితోఁ గలిసి మీరు కౌశాంబికి రావలయునని యా దూతను మిత్త్రిని పుళిందకుని వత్సరాజు నియమించి సకల పరివారముతోఁ దాను గౌశాంబికిఁ దరలెను.

వింధ్యారణ్యమే యుద్దవిడి లేచి వచ్చెనో యన్నట్లు మహానాగేంద్రములు శ్రేణులు కట్టి వెంట వచ్చుచుండ— వారువంబుల గొరిజల తాకిళ్ళచే కంగుకంగున మ్రోగుచున్న

నేల వందిభావ మొంది వత్సరాజును గైవారము సేయు చున్నదో యన ముచ్చటగా నొప్పుచుండ-మన్ను మిన్నేకమై రేఁగి సేనారజోరాసులు చూపఱకు విభ్రాంతి గొలుపు చుండఁ గతిపయ ప్రయాణంబులలో వత్సరాజు ప్రియా సహితుండయి కౌశాంబిని సమీపించెను. మున్ముందు రుమ ణ్వంతుఁడు మహారాజు రాకను బురములోఁ జాటఁ బంచుటఁ జేసి పౌరజను లెల్లరు మోదాబ్ధిలో మునిఁగి తేలి రివ్వన తెక్కెలు గట్టుకొని యెదురు వచ్చిరి. పౌరాంగనా మణులు కటాక్షమాలికలతోఁ దోరణములు కట్టి దరహాస ప్రభా తరంగితములగు వదన కాంతులతో నీరాజనములు పట్టుచుండ వత్సరాజును వాసవదత్తయు రాజమందిరము చొచ్చిరి. ఎందుఁ జూచిన వందిమాగధుల మంగళ గానములు మిన్ను ముట్టెను. ఎచ్చటఁ జూచిన గొలువునకై వచ్చిన రాజబృందముల సందడియే కళకళ లాడుచు రాచనగరు ముదమునఁ దాండవించెను.

అంతలో మహాసేనుని తనయుఁడు గోపాలకుఁడు పుళిందకునితో దూతతో కౌశాంబికి వచ్చి కోటలోనికిఁ జొచ్చెను. తేఁడు ప్రత్యుత్థాన మొనర్చి వారిని జక్కఁగా గారవించెను. వాసవదత్తయు నన్నను జూచి కన్ను చెమర్చి పట్టరాని హర్షముతో వికసిత వదనారవింద యయ్యెను. గోపాలకుఁడు సోదరిని బుజ్జగించి దేశములోని వార్తలను గోటలోని కబురులను దల్లిదండ్రుల ముచ్చటలను సర్వ జనము సేమమును వినిపించిన నామెయు ధన్యజన్మ నైతినని పొంగి యభిజన సమాగమ సౌఖ్య మనుభవించెను.

ఆవల హితులు పురోహితులు మంత్రులు శుభదినము నిర్ణయించి వివాహ మహోత్సవమును బ్రకటించిరి. దేశదేశముల నెల్లరకుఁ బిలుపులు వెడలెను. సామంతులు శ్రీమంతులు, వైభవంబులతోఁ గానుకలతో వేడుకగాఁ దరలి వచ్చిరి. కళకళలాడు కౌశాంబిలోఁ గల్యాణలక్ష్మి నృత్యము సేయఁ దొడంగెను. మహా వైభవోపేతముగ నుదయన మహారాజునకు వాసవదత్తా దేవికి వివాహ మాయెను. పూర్వ పరిచితులైన నవీన వధూవరులు రసమయ జీవితములో సమ్మోహన బీజములు మెదపి — అమృత స్రవంతిలో మునింగి తేలుచున్నట్లు — అమృతాంశు బింబములోఁ జొచ్చి పారవశ్య మందినట్లు విలాసనిధులై యెంతయు విరాజిల్లిరి. చండమహాసేనుఁడు సత్కార పూర్వకముగఁ బంపిన యమూల్య రత్నరాసులను స్వీకరించియు సామంతులు సమర్పించిన సర్వబహూకృతులు గైకొనియు వత్సరాజు సత్యముగాఁ జక్రవర్తియే యయ్యెను.

వైవాహిక మహోత్సవము ముగిసి ముచ్చటలు పెక్కులు తీరిన పిదప వధూవరుల ముఖ్యబంధువులకు సత్కారములు జరిగెను. యౌగంధరాయణ రుమణ్వంతులు కనుగలిగి — ఆ వచ్చిన పెద్దలకుఁ బౌరులకు సామంతులకు హితులకు సత్కారములు జరిపి వత్సరాజునకు లోకరంజకుఁడను దొడ్డ పేరు గడించి పెట్టిరి. మహామంత్రి యౌగంధరాయణునకు మిత్రరత్నము వసంతకునకు వత్సరాజు తానే వస్త్రాలంకరణములు సమర్పించి యంగరాగములు పూసి మడిమాన్యము లిచ్చి మిక్కిలియు సమ్మానించెను. తండ్రియానతి యాదల

దాలిచి వచ్చిన గోపాలకుఁడు - ఉద్వాహ మహోత్సవము చక్కఁగా నెఱపి వత్సరాజు ముదల గైకొని యుజ్జయినికి వెడలిపోయెను.

౫

## రాజ్యప్రవృత్తి

ఇవ్విధిని వత్సరాజు తాను వలచిన వాసవదత్తను జేపట్టి తత్సాంగత్యైక పరాయణత్వమునఁ దక్కిన ప్రపంచమే మఱచిపోయెను. సచివాగ్రగణ్యుఁడు యౌగంధరాయణుఁడు సర్వథా మెలఁకువ గలిగి రాజ్యమును జూచుచుండెను. సేనాపతి రుమణ్వంతుఁడు వానికి హృదయమిచ్చి చేదోడు వాదోడుగాఁ గలసిమెలసి యుండును. ఒకనాఁటి రేయి యౌగంధరాయణుఁడు రుమణ్వంతుని దన యింటికిఁ గొంపోయి విచారగ్రస్తుఁడై యేకాంతమున నాతనితో నిట్లు వచించెను:—

మిత్రమా! మన యేలికవృత్త మెఱింగియే యుందువు. ఈతఁడు పాండవవంశ ప్రభూతుఁడు గదా! సర్వభూతలము హస్తినాపురమును వీనికిఁ గులక్రమాగత స్వామ్యములు. జిగీషారహితుఁడై యీతఁడు సప్తవ్యసనములలోఁ దగులుకొని కులక్రమాగత వైభవమును వీటఁబుచ్చుచున్నాఁడు. రాజ్యభార మంతయు మంత్రుల భుజస్కంధములలో నునిచి కేవలము స్త్రీలోలుఁడై గానకళా పరాయణుఁడై క్రమక్రమముగ నెలుబడిలో వెనుకఁబడి పోవుచున్నాఁడు. రాజ్యమా

సన్నగిల్లినది. జైత్రయాత్రలా యపూర్వములయ్యె. శత్రు రాజులా బలసిపోయిరి. చేయి జాఱిన పిదపఁ జేయున దేదియు లేదు. కులక్రమాగతమైన సర్వధరణీ రాజ్యము మఱల వత్సరాజునకు దక్కు మార్గమే మన మాలోచింప వలెను. అప్పుడుగాని మన సాచివ్యము భక్తిప్రపత్తులు సఫల ములై తన్మూలమున మనము ధన్యులము కానేరము. స్త్రీ విషయలోలు నీతని నెక్కైన బుద్ధిప్రాభవముచే బుద్ధి మఱ లించి తొల్లింటి భూపతినిగాఁ జేయవలసిన యక్కఱ మనకుఁ గదా యున్నది! బుద్ధి ప్రభావముచే దుస్సాధమైన కార్యము సైతము సుసాధము చేయఁవచ్చును. మిత్రమా! దానికిఁ దార్కాణ మిదిగో చెప్పెద వినుము:—

## మహాసేనుని కథ

తొల్లి మహాసేనుఁ డని నరపాలకుఁ డొకఁ డుండెను. ఆతనికి మహాబలాఢ్యుఁ డైన పరరా జొకఁడు ప్రబలశత్రువై యనుక్షణ మాతని రాజ్య మాక్రమింప నువ్విళు లూరుచుఁ బొంచి పొంచి యొకానొకతఱి నపారసైన్యము సేకరించి యుద్వృత్తుఁగ నాతని మీఁదికి దండెత్తి వచ్చెను. ఆ యెడ్డడికి మంత్రు లందఱు తద్దయు విహ్వలచిత్తులై భావ్యనర్థమునకుఁ బ్రతీకారము సేయ వలంతులుగాక కింకర్తవ్యతా మూఢులై తుది కాతనికి లోఁగి తమ యేలికచే నాతనికి దండ మిప్పించి సేఁగి తొలంగించిరి. మానవంతుఁడైన మహాసేనునిఁ బరిభవా నలము కాల్చివేయఁ బరితాపము మిక్కిలియై తుది కాతఁడు రోగగ్రస్తుఁడే యాయెను. విచారభారముచేఁ గడుపులో

గుల్మము పుట్టి మరణ మాసన్నమయ్యెను. వెజ్జు లెందఱో మందులు మ్రాఁకులు పోసిరి. ఎన్నో చికిత్సలు చేసిరి. బుద్ధి మంతుఁడైన వైద్యుఁ డొకఁడు - ఉపాయమువన్ని జేసి సన్నిధికివచ్చి అయ్యా! నీ దేవి పరమపదించెనని హఠాత్తుగఁ జెవిలోఁ జెప్పెను. దాని కాతఁడు దిగ్భ్రమ మంది వజ్రపాత మునఁ గొండవోలె నేలమీఁదఁ బడిపోయెను. అప్రయత్నముగ నావిర్భవించిన యపూర్వ శోకావేశముచేఁ గడుపులోని గుల్మము బ్రద్దలయి నెత్తురు వఱదలయ్యెను. దైవికముగ నారాజు నిరోగుఁడై యుపద్రవము కడచి చిరకాలము సర్వభోగము లనుభవించి శత్రుమహీపతులను జయించి హాయిగా రాజ్య మేలెను.

ఆతని కా వైద్యుఁ డేతీరుగ నుపాయమును బన్ని యుపాయమును బాపెనో యట్టులే మిత్రమా! మనము నైతము మన రాజుకోసము ప్రయత్నించి సామ్రాజ్యము నుద్ధరింపవలెను. మన యేలికకు మగధరాజు ప్రద్యోతన మహారాజు సర్వథా శత్రువుగదా! ఆతని కూఁతును పద్మావతిని వత్సరాజు వివాహ మాడెనేని మన మనోరథ మీడేరి తీఱును. ఈ మనువు కుదుఱుటలోఁ బెక్కులు చిక్కులును గలవు. కూఁతు నీయుట కొకమాత్రాన ప్రద్యోతుఁడు తల యూఁపఁడు. మున్నొకప్పు డీమాటయే యాజేని మ్రోల నేను బలుకఁగా — ఓహో! చాలుఁజాలు. వత్సరాజునకు వాసవదత్త యన్న ప్రేమము మెండా మె. ప్రాణమువంటి నా బిడ్డను దెలిసి యారాజున కెట్టులిత్తును. అని గట్టిగా నతఁడు పలికి ననేమిరా యనెను. అది యటుండె. వత్సరాజు

సైతము వాసవదత్త తన కంటికిఁ గానిపించునందాఁక మఱి యొక కన్నెను బెండ్లియాడఁడు. నిరపాయమైన యుపాయము పన్ని వాసవదత్తా గృహమునకుఁ జిచ్చువెట్టి యామె కాలి పోయెనని లోకములో వదంతిని బుట్టింతము. అప్పుడు పద్మావతిని వత్సరాజున కిమ్మని మన మడుగవచ్చును. సర్వము సులువుగా సమకూరవచ్చును పద్మావతి వత్సరాజునకు ధర్మపత్ని యైనచో మగధరాజు మనరాజునకు సంబంధియై తొల్లింటి వేరమి యెల్లను మాసిపోవును. అత్తఱి జైత్ర యాత్రకై మనము వెడలుటయు సర్వవిధాల శ్రేయస్కరము. నిక్కముగా నేలయంతయు నప్పుడే మన యేలిక యేలఁగా వీలు చిక్కును. ఈ యంశము మున్ను - ఆకాశవాణియుఁ బల్కుట మన మెఱుంగుదుము.

నా విని రుమణ్వంతుఁడు - అయ్యది సాహసకృత్య మేమో యని మిక్కిలియు శంకించి యౌగంధరాయణునితో నిట్లని పలికెను:— మిత్రమా! మేలుకోరి చేయుచున్న యీ కార్యములో నొకవేళ దోసమేమైన దొరలునేమో! పద్మావతి కొఱకై యుద్యమించుటలో వాసవదత్తా హృదయము నొచ్చుకొను నేమో! ఈ పట్టున నొకానొక గాథ కన్నులకుఁ గట్టినట్టులు కానవచ్చుచున్నది. శ్రమ యనుకొనక సావధానముగ వినవలతును:—

## మౌన సన్న్యాసి

గంగాతీరమున మాకందిక యను పట్టణమున్నది. అందులో మున్ను మౌనవ్రతుఁ డను పరివ్రాజకుఁ డొకఁడు

వసించుచుండును. తోడి పరివ్రాజకులు నిచ్చలు తన్నుఁ గొలుచుచుండ నూరిలో భిక్షాటనము చేసికొనుచు గుడియొద్ద మఠములో నాతఁడు నివాసముండును. ఒకనాఁడు భిక్షార్థము పోయి నగరములో నొకానొక బేహారి యింటివాకిట నిలిచి బిచ్చమునకై వేచియుండెను. అప్పు డాయింటిలో నున్న కన్నె యొక్కర్తుక చూడఁ జక్కనిది బిచ్చము పట్టుకొనివచ్చి వానికిఁ బెట్టెను. ఆమెను జూచినదే తడవుగ నా సన్న్యాసి కామవశంవదుఁడై బుద్ధిపోయి మౌనము మాని యింటివారికి వినఁబడునట్టులు 'అయ్యయ్యో! ఎంత కష్టము! ఎంత ఘోరము!' అని యుస్సురని వచించి యదే పోకగా మఠమునకుఁ బోయెను. బేహారి యచ్చెరువంది చెచ్చెఱ నొంటిగా మఠమునకుఁ బోయి; అయ్యా! వింతగా మౌనము మాని నేఁడు మాయింటివద్ద నేదో యంటివే! అదేమో సెలవిత్తువా! అని సన్న్యాసి నడిగెను. అది విని సన్న్యాసి లోలోన నవ్వుకొని యాతనితో నిట్టులనియెను:— ఓయీ! ఊరక వాగ్వ్యయము సేయుట మాబోటి యోగిజనమునకుఁ దగదు. పనిగాఁ బెట్టుకొని వచ్చినవాఁడ వగుటఁబట్టియు నీవు నా భక్తుఁడవని తోఁచి నీకు రానున్న మహానర్థకము గుఱించి విచారము కలుగుటఁ జేసియుఁ బోనిమ్మని మౌనము సైతము మానవలసి వచ్చినది. ఈ యనర్థ మింతింత యని వచియింప నా తరముకాదు. నీకూఁతురు లావణ్యవతి యని యందఱుభావింపవచ్చును. ఈబిడ్డయింకనువివాహయనితోఁచి యేదో జ్ఞానమును బట్టి భావిపరిస్థితి నూహించితిని. అపురా! గుండె బ్రద్దలైనది. ఆమె శుభలక్షణలక్షితాంగి కానే కాదు.

పైఁగా నామె కే నాఁడు ముద్దుమురిపముగ పెండ్లి చేసెదరో నాఁడే యవశ్యము ఇంటిల్లిపాది నాశనము వొందెదరు. ఇది ముమ్మాటికి నిక్కము. నిన్నుఁ జూచి దుఃఖము పట్టలేక మానము సైతము మాని భ్రష్టుఁడ నైతిని. నా మాట విందు వేని సర్వనాశనము సమ్మతింపవేని - ఇదిగో ఈ రాత్రియే పిల్లను పెట్టెలోఁ బదిలముగాఁ బెట్టి దానిపై దీపముంచి గంగలో వదలిపెట్టుము. ఆవల నీ యిష్టము. నా విని కోమటి బిడ్డ పిటికిపంద కావుటను సన్యాసిమాట సత్యమే యని గట్టిగా నమ్మి యాతనితో నట్లే చేసెదనని యొట్టు సైతము పెట్టుకొని అమ్మయ్యో! నీ మూలమున బ్రదికితిమి గదా! అని యాతనిని గొండాడి వినయముతో సెలవు తీసికొని రివ్వున నింటికి వచ్చిపడెను. పిటికి కండలో బెదరు గుండెలో పూర్వాపర విమర్శనము పూజ్యము గదా! అదే యావలో నాతఁడు సర్వసన్నాహములు సమకూరిచి ప్రొద్దు క్రుంకఁగా బిడ్డను పెట్టెలోఁ బెట్టి యేటిలోఁ బాఱవైచెను.

ఇచ్చట నీ సన్న్యాసి యొడ లంతయు రేఁగి గాడు ముదిరి యుత్సాహము ప్రజ్వరిల్ల ననుచరులను బిలిచి; ఓహో! నా మాట వినుఁడు గంగదరికి మీ రందఱు పొండు. అక్కడ నొక్క మందసము కొట్టుకొని వచ్చుచు నీటిలోఁ గానవచ్చును. దానిమీఁద దీపము వెలుఁగుచుండును. పదిలముగా దాని నిచ్చటికి మీరు కైకొని రండు. ఒకవేళ నందులోనుండి యేదో ధ్వని వినవచ్చినను మూతను మాత్రము తీయవలదు. భద్రము సుమా! అని వారి కాజ్ఞయిచ్చి సంజ చీఁకటిలో వారి నచ్చటికిఁ బంపివైచెను.

ఇంతలో గంగాతీరమున బోవుచున్న రాజకుమారుఁ డొక్కఁడు దీపము సాయమున - ఆ మందసమును గాంచెను. వెంటనే భటులచే దానిని గట్టునకుఁ బట్టించి యుత్కంఠతో దానిని బ్రద్దలు గొట్టించి చూచెను. తత్తఱపడి బిక్క మొగముతో నందులోనుంచి వైశ్యకన్య వెలికి వచ్చెను. రాజకుమారుఁ డామెను బుట్టు పూర్వోత్తరము లడిగి కథ యంతయు జక్కఁగా గుర్తించి మంచి మాటలచే నామె నూఱడించి గాంధర్వవిధిచే నామెను వివాహ మాడెను. ఆవల నా రాచబిడ్డ బిరుసు గొలుపు కొండముచ్చు నొక్కటి పట్టి తెప్పించి యా పెట్టెలోఁ బదిలముగాఁ బెట్టించి మూతను సరిచేసి తొల్లింటివోలె దీపముతో దానిని గంగలో నెట్టించి తన త్రోవను తాను సతీసమేతుఁడై బోయెను.

అయ్యెడ సన్న్యాసి శిష్యులు పరుగు పరుగున గంతులు వైచుచు వచ్చి వచ్చి-అనుకొన్నట్టులు గంగలోఁ గానవచ్చిన పేటికను బట్టుకొని యొడ్డునకు లాఁగి యుల్లాసముగా దానిని గురుసన్నిధికిఁ గొంపోయిరి. గురువర్యులు దానిని గాంచి వారిని మెచ్చుకొని మిక్కిలి ముదంపడి యప్పుడే దానిని మిద్దెమీఁది కెత్తించి — ఓహో! శిష్యులారా! నాకొక్క కోరిక కలదు. మిమ్ములను నమ్మి యీ యుద్యమములోఁ జేయి పెట్టితిని. రేయియెల్ల నొంటరిగా మిద్దెమీఁది మంత్రము సాధింతును. దాని ఫలిత మావలఁ జాతురుగాని యిప్పుడు మీ రెల్లరు క్రిందనే - ఆదమఱచి నిద్రింపుఁడు. అని వారిని బంపి తా నొక్కఁడు మిద్దెమీఁద నుత్కంఠ పెల్లుబేఁగ నేవేవో యూహలు పోవుచుఁ గాంతామణికోసమై

మందసము మూతను తీసివైచెను. అప్పుడు రివ్వున లోపలినుండి ఘోరాకృతి దాల్చిన కొండముచ్చు నెట్టన దూఁకి యా నీచునిమీఁదఁబడి ముక్కును మొగమును గోళ్ళతో అక్కి చెవులుపీఁకి శాస్తిచేసి పాపఫలము కుడిపించి గంతులువైచుచుఁ బాఱిపోయెను. ఆదురవస్థలో గురువుల వారు కుంటుచుఁ గుంటుచుఁ గ్రిందికి దిగివచ్చిరి. శిష్యులెల్లరు వానినిజూచి పకాలునఁ బొట్ట చెక్కలగునట్టులు వెటకారముగా నవ్వి యాకృతికి వింతపడి యెట్లో రాత్రి యాతనితోఁ గడపిరి. వేఁకువజామునకు సన్న్యాసికథ యూరంతయు గుప్పుమనెను. అందఱు వచ్చి నవ్విరి. మొగమున నుమిసిరి. తిట్టిరి. తన్నిరి. వర్తకుఁడు మాత్రము బిడ్డకు మంచి మగఁడే దొరకెను బోనిమ్మని నిలువెల్లఁ బొంగిపోయెను.

మిత్రమా! కపట ప్రయోగము సిద్ధింపనినాఁడు - ఇట్టిపాట్లే పడవలసిన గతిపట్టును. వాసవదత్త పోయెనన్న వార్త వత్సరాజు నేమి చేయునోయని నా గుండె బెదరుచున్నది. వారిర్వురి వియోగములోని యనర్థము నన్నింతగా సంశయాత్ముని జేయుచున్నది.

ఈ మాటలు విని యౌగంధరాయణుఁడు పెండియు నిట్లనియె:- నీవు పల్కినది యొకవిధముగఁ గాదనను. గత్యంతరము లేకయే యీ యుపాయమున కాసపడవలసి వచ్చినది. ఈ యుద్యమమును మానితిమా మఱియు ననర్థములే వచ్చిపడును. వ్యసనాసక్తుఁడైన యీ ఱేని మూలమున నున్నకొలఁది రాజ్యముసైతము మూడిపోఁగలదు. మంత్రులమైన మనలను లోకులు నిందింతురు. స్వాధీనసిద్ధియైన ఱేనికి

సర్వదా వాని ప్రజ్ఞయే సాధనము. ఆతని మాటలోనుండు మంత్రివర్గమునకుఁ గార్యముపట్ల మంచిసెబ్బర లంటుకొనవు. వత్సరాజు చూతుమా సచివాయత్తసిద్ధి. ఈతనికి మంత్రుల తంత్రములే కార్యసాధనములు. అట్టిచో మనమే యుపేక్షిం చుమా కంచెయే చేను మేసినట్లగును. మన ప్రజ్ఞాపాటవము చూపను నక్కఱయు నిప్పుడే. చండమహాసేనుఁ డేమి సేయునో యను భీతి రవ్వంతయు వలదు. ఆతఁడును వాని బిడ్డలును దేవియు నా మాట కాదనరు. ఆ భారము నాది.

రుమ : మిత్రమా! అది కాదు. ఈ ప్రయోగములో నేమైన ప్రమాద ముండునేమో యన్న సందియ మింకను దీఱలేదు. ఎవ్వరికైనఁగాని - అభీష్టస్త్రీ - వియోగ ముచే మతిచెడిపోవును. పైగా మన వత్సరాజు ప్రకృతియు నతివిచిత్రము. ఇష్టార్థసిద్ధి కాని నాఁడు గుండె చెదిరిపోవుటయుఁ గలదు. మన యీ ప్రయో గమునఁజేసి వాసవదత్తా వత్సరాజు లేమయ్యెదరో!

యౌ : రాజులు కార్యదృష్టిచే నెంతలేసి క్లేశములనైన సహింతురు. రావణుని బాధలు పడలేక యుక్తిగా దేవతలు కల్పించిన వియోగబాధను సీతారాములు భరింపలేదా!

రుమ : మిత్రమా! అవునుగాని రామాదులు దేవతాత్ములు. కావున వారు సర్వమును బుద్ధిలో గుర్తించి కష్టములు సహించిరి. మానవబుద్ధి అట్లుకాదే. మానవులలో నెందఱో దంపతులు పరస్పర వియోగవ్యథాభార

ము చే అసువులు పాసినవారు కలరు. వత్సరాజునకు దేవికి మనమే ఆ వియోగము కల్పింపనేల!

యౌ : సోదరా! ఆపదలు రానున్నవని సంపదలను దూరీకరింతుమా! సాహసమందే విజయమున్నది. ముందే నేను సహస్ర విధాల కృత్యవిచారణ చేసి యిది యిట్లే యగుఁగాక యని నిశ్చయించి యున్నాను. సాధారణముగా రాజుల వ్యవహారము లిట్లే సాగుచుండును. రాచకార్యముల పోకడయు నిట్టిదే. దేవి దాహప్రవాద లోకములో వెడలించి ధైర్యముతో - ఈ కార్యమును గట్టెక్కింపవలయును.

ఆతని నిశ్చయము మఱలింపలేక రుమణ్వంతుఁ డెట్టకేలకు సమ్మతించి యొక్కటి మాత్రము కోరెను. మహామంత్రీ! అదే నిశ్చయమందువా! ఈ వ్యూహములో దేవీ సోదరుని గోపాలకుని సైతము చేర్చి వ్యవహారము చూతము. సరే యని దానికి యౌగంధరాయణుఁడు సమ్మతించెను. ఆతని ప్రజ్ఞాపాటవమున విశ్వాసముంచిన రుమణ్వంతుఁడు- ఆతని యుద్యమములోఁ జేరుటకే సర్వథా సంసిద్ధుఁడాయెను.

మహామాత్యు లిద్దరు మఱునాఁ డొక దూతుని బిలిచి ఓయీ! యుజ్జయినికిఁబోయి మేము చూడఁగోరినారమని చెప్పి గోపాలకునిఁ దోడ్కొని రమ్మని యాజ్ఞాపించిరి. వాఁడును మంత్రి శాసనము శిరసావహించి రివ్వున నుజ్జయినికిఁ బోయి గోపాలకునికి విన్నవించెను. యౌగంధరాయణుని మాట యన్న మిక్కిలి గౌరవము నూపు గోపాలకుఁ డా

సందేశమును విని సత్వరముగఁ గౌశాంబికి వచ్చెను. మహా మంత్రు లిద్దరును వానితోఁ గలిసి యేకాంతమున మంతనములు సలిపిరి. తాము పిలిచిన దిందులకే యని తమ సంకల్పము సమగ్రముగ వివరించిరి. గోపాలకుఁడును లెస్సగఁ బరిశీలించి అయ్యది తన సోదరికి దుఃఖావహామే అయ్యు-రాజు మేలునే కోరి సరే యని సమ్మతించెను.

సచివోత్తము లిద్దరీ విషమ ఘట్టములో గోపాలకుని జేర్చుటలో గొప్పలాభ మున్నది. దేవి దగ్ధయాయెనని వదంతి వినఁగానే లాఁతివారు వగచినట్లు గోపాలకుఁడు వగవఁడు. ఆతని వైఖరిని బట్టియే – ఆశాలేశము దారిచూప వత్సరాజు సైతము దేవి బ్రదుకులో నోరిమికలిగి యుండును. ఇది యిట్లని గుర్తించి యా ముగ్వురా నాఁటి రేయి కర్తవ్యమును సమగ్రముగా నిర్ణయించిరి.

## లావాణక ప్రవేశము

మగధదేశము పొలిమేర నంటుకొని వత్సరాజు నేలుబడిలో లావాణకమని పేరువొందిన ప్రదేశ మొకటి కలదు. అయ్యది యత్యంత రమణీయభూములు కలిగి వేఁటవోవుటకు విలాసముగాఁ బ్రొద్దులు పుచ్చుటకు గ్రాసవాసముల కనువైన చక్కని ప్రాంతము. ఎడపదడప మగధరాజు తాకిడి దానికిఁ దగులుచుండును. ఈ ప్రదేశమే తమ వ్యూహామున కనుకూల మని యౌగంధరాయణాదులు రూఢి చేసికొని యొక నాఁడు వత్సరాజు సమ్ముఖమున నిట్లని విన్నవించిరి:—
దేవా! లావాణకము పోవుటకు మన కియ్యది ముఖ్య సమ

యము. అది యత్యంత రమణీయ ప్రదేశమని దేవరవారికి విదితమే. ఇప్పు డచ్చటికిఁ బైనమగుటలో నేలినవారికి రెండు విధాల శ్రేయమని మా భావము. అచ్చట ముచ్చటగా వేఁట తమకము తీర్చుకోవచ్చును. ఆ ప్రాంతమందలి మగధ రాజు నొత్తిడి తొలఁగించుట సైతము ప్రభువుల విధి. ఆవల మీ చిత్తము. దాని విని వత్సరాజు కాదని యనక వాసవదత్తయుఁ దాను విలాసముగాఁ గ్రొంగ్రొత్త లగు క్రీడలలోఁ బ్రొద్దులు పుచ్చవచ్చు నని మఱింతగా మురిసి [illegible]వాణక ప్రయాణమున కుద్యుక్తుఁ డాయెను.

ఇంతలో హఠాత్సంభవముగ సర్వలోక సంచారి యగు నారదుఁడు తన దివ్యమైన దేహకాంతులచే నెల్ల దిక్కులకు వెలుంగు లొసంగుచు వత్సరాజు నద్దకు వచ్చెను. ఆదరాతిశయముతో నారదమానికి నాతిథ్యము చేసి వినీతుఁడై నిలిచిన వత్సరాజునకుఁ బారిజాత కుసుమ మాలను బహూకృతిగా నొసంగి దేవర్షి విద్యాధరాధీశుఁడైన పుత్త్రిరత్నముం బడయు భాగ్యము కలదయ్యా నీకని జేని నభినందించి యెల్లవారు వినుచుండ నెండియు నిట్లనియె—ఓహో! రాజా! నీధర్మపత్ని వాసవదత్తను జూడఁగా మున్ను నీ ముత్తాతలు ధర్మజాదుల కథలు జ్ఞప్తికి వచ్చుచున్నవి. నాఁడు వారికి సర్వలక్షణలక్షితాంగ ద్రౌపది యెట్లో నేఁడో నీకు వాసవదత్తయు నట్లు. ఆనాఁడు ద్రౌపది త్రిలోకసుందరి యైనట్లు లీనాఁడు వాసవదత్త జగదేకసుందరి. అప్పుడు వారల దాంపత్యములో దోషము నూహించి యొక నాఁడు వారితో నచ్చట ముచ్చటగాఁ గొన్ని మాటలు

చెప్పితిని. స్త్రీవైరము లోకములో నాపదలకు మూల మని యెన్నో తార్కాణము లిచ్చితిని. సుందోపసుందుల గాథను వివరించి చూపితిని. ద్రౌపది మూలమునఁ బరస్పరస్పర్థలు రాకుండ కట్టడ చేసికొనుం డంటిని. సరేయని వారును బుద్ధిమంతులు కావుట నామాట జవదాఁటక యొకానొక నియమముతో — ఏకమనస్కులై యేఁడుగాలము మెలంగిరి. వారు నాకు మిత్త్రులు గావున నీవును నాకు నాత్మీయుఁడవే. రాజా! ఒకమాట చెప్పెద వినుము. నాఁడు నామాటను నీదు ముత్తాత లెట్టులాదరించి — ఆ తీరుగ నడచి సుఖపడిరో — అట్లే నీవును నేఁడు నీమంత్రుల మాటలను జక్కఁగా నాదరింపుము. అద్దాన నీకు నచిరకాల మందే గొప్ప కల్యాణము సమకూరును. అందుఁ గొన్నాళ్ళు కష్టపునాళ్ళు కావచ్చును. అప్పుడే ధైర్యము వహింపవలెను. అతిమోహము పనికిరాదు. ఆ కష్టము సర్వము సుఖపర్యవసాయి కావున నా మాట మీఱవలదని యిదే హితోపదేశముగాఁ బలుకుచున్నాను. అని యేదో శుభమును సూచించి అంతర్ధాన మందెను. ఈ ఘట్టము సర్వము తమ యుద్యమమునకు నాందీప్రస్తావ మని యౌగంధరాయణాదు లానందించి మఱింత యుత్సాహముతో బ్రవర్తింపఁ జొచ్చిరి.

౬

శుభలగ్నము నిశ్చితము కాఁగా లావాణక ప్రయాణము సర్వము సంసిద్ధమాయెను. ఎల్లకడల హోరాహోరిగఁ బర్వుచు సేనానివహము ఘోషము యౌగంధరాయణాదుల

యభీష్టమును వేనోళ్ళ సూచించుచుండెను. వలయు సంబా రము లొకచక్కిని జతురంగబలము లొకవంకను వచ్చు చుండ మంత్రులతో హితులతోఁ బురోహితులతో జగజ్జే గీయమాన కీర్తివితానము మోసికొనుచు వత్సరాజు లావాణ కము చేరెను. ఉద్ధృతమగు నీ ప్రయాణవార్త నింతలో మగధరాజెఱింగి తనమీఁది కెత్తివచ్చుటకే యని మదిలో భీతిచెంది యౌగంధరాయణుని వద్దకు నొకానొక దూతను బంపెను. సమయజ్ఞుఁడైన సచివోత్తముండును వాని దూత్యము నంగీకరించెను. ఆవల నా ప్రాంతమున వత్సరాజు నివాసము పెట్టుకొని యనుక్షణము విలాసగోష్ఠిలో - ఆడ మఱచుచు వేఁటలో మునిఁగి తేలుచు దుర్గమారణ్యములలో నిరంతరము త్రిమ్మరుచుఁ గాలము కడపుచుండెను.

## దేవీమందిర దాహము

ఒకనాఁడు వత్సరాజు వేఁటతమకము మిక్కిలి కాఁగా సర్వ పరివారముతో దూరారణ్యములకుఁ దరలిపోయెను. ఇచ్చట యౌగంధరాయణుఁడు వసంతక గోపాలక రుమణ్వం తులతో వాసవదత్తా సన్నిధికి వచ్చెను. వచ్చి యన్న గోపాలకుఁడు ముందుగ హెచ్చరింప యౌగంధరాయణుఁడు దేవిని రాచకార్యములలో సాయపడుమని యేవేవో మంచి మాటలచే సాంగోపాంగముగ నా కథ వివరించి తద్దయుఁ బ్రార్థించెను. ఆ ప్రయోగ మామెకు భర్తృవిరహ సంపాద కమై నిరంతర క్లేశమును గూర్చునది కావున మూర్ఛవడి కొంతవడికి దెప్పిఱి మహామంత్రుల మాటను జవదాఁటని కులాంగన గావున నట్లే యని దానికి నంగీకరించెను.

యౌగంధరాయణుఁ డామెకు రూపమును మార్చు యోగ ముపదేశించెను. దాని బలముచే దేవి బ్రాహ్మణి వేషము దాల్చెను. వసంతకుఁ డేకాక్షియై బ్రహ్మచారి చిన్నవాఁ డయ్యెను. మహామంత్రి వృద్ధబ్రాహ్మణుఁ డాయె. తత్క్షణమే మువ్వురు మగధదేశమునకుఁ దరలిరి. వాసవదత్తా దేహము నడచుచుండెనేగాని హృదయము వత్సరాజు వంకకే పోయి తిరిగి రాకుండెను. ఇంతలో రుమణ్వంతుఁడు దేవీమందిరమునకుఁ జిచ్చు వెట్టి అయ్యయ్యో! యేమి చేయుదము. దేవియు వసంతకుఁడు కొంపలోఁ గాలిపోయిరే! ఔరా! వారా! వీరా! యని యఱువసాగెను. ఒక్కసారి పెనుమంటతోపాటు - ఏడ్పులు పెడబొబ్బలు నింగికిఁ జెలరేఁగి మూపఱు గుండెలు బ్రద్దలు చేసెను. క్రమముగ మంటల యుద్ధతి తగ్గెనేగాని యేడ్పులు మాత్ర మాఱవయ్యెను.

వేషధారి యగు యౌగంధరాయణుఁడు వసంతకునితో వాసవదత్తతో మగధరాజు పట్టణము చేరెను. అందు నుద్యానవనమందు మగధరాజు పుత్త్రిక పద్మావతి యున్నదని మహామంత్రి యెఱింగి యావంకకే నడచెను. ద్వారరక్షకు లడ్డగించిరి. వారిని లక్ష్యపెట్టక మువ్వురు లోనికరిగిరి. బ్రాహ్మణి రూపము దాలిచి వాసవదత్త కానుపింపఁగా పద్మావతి కెందులకో భక్తి యుద్భవించెను. కావలివారల నావలకుఁ బంపి బ్రాహ్మణ వృద్ధుని బరమగౌరవముగాఁ బిలిచి - ఈమె నీ కేమి కావలెను? ఎందుల కిందులకు వచ్చితిరి? అని పద్మావతి యడిగెను. వృద్ధ బ్రాహ్మణుఁ డది విని యామెతో

నిట్లనను—అమ్మా! ఈబిడ నా కూఁతుఱు. దీని పేరు అవంతిక. దీని పెనిమిటి దుర్వ్యసనాసక్తచిత్తుఁడు. ఆతఁ డీమెను విడనాడి యెటుపోయెనో పోయెను. రాజపుత్త్రి! నా మనవి విందువా! ఈబిడ్డను నీ చేతిలోఁ బెట్టిపోయి ఆతనిని వెదకి త్వరలోఁ దెచ్చుకొందును. అందాఁక నొంటిగా నుండి దిగులుతోఁ బొగులునేమో - అవిటికంటి వానిని - ఈబిడ పోదనసిగూడ నిచ్చటనే యుంతును. కాదనక దీనికి సమ్మతించి మమ్ము ననుగ్రహింప వేఁడెదను. అని పలుక నా దురవస్థ యంతయు నిక్కమే యని తోఁచి పాప మట్లే పోయిరమ్మని పద్మావతి యొప్పుకొనెను. అంత నా మంత్రి వర్యుఁ డామె సెలవు కైకొని రివ్వున లావాణకమునకుఁ బోయెను.

అవల పద్మావతి అవంతికను బ్రహ్మచారిని జక్కఁగా సత్కరించి నాటికి వనవిహారము చాలించి వారిని వెంబఁ గొని యింటి కరిగెను. కుడ్యచిత్రములచే విలాసవస్తువులచే మనోజ్ఞమగు నా మందిరములో వాసవదత్తా హృదయము స్తిమిత మందదాయెను. కుడ్యములమీఁద జిత్రించిన సీతా రాముల చరిత్రలో సీతాప్రతిమను జూచి యామె విరహ వ్యథాభారమును సైఁచి యుండెను. నీలోత్పల సువాసనలు గుబాళించు దేహసౌరభము పొలయు నడకలోఁ నవకములో గుదిరికలో నసామాన్యయని నేనోళ్ల ఘోషింపఁజేయు నా వాసవదత్తను జూచినకొలఁది నామె యోగ్యురాలుగా నుత్తమవంశ సంజాతగా పద్మావతి గుఱితింపఁ దొడఁగెను. ఆసన శయనాదికము లన్నింటను బద్మావతి యామెకు నను

వగు నుపచారములే యొనర్చుచుఁ దన కీడు జోడుగఁ జూచు కొనఁ జొచ్చెను. మాటల ధోరణిలో సైతము నీ వెవరవని యడుగదు. మున్ను విరాటు మందిరమున గాలమును బట్టి అజ్ఞాతముగా ద్రౌపది మెలఁగినట్లు లీమె, యెవ్వతెయో ప్రచ్ఛన్నవృత్తిలోఁ గాలము గడుపుచున్నదని పద్మావతి భావించెను. ఒకనాఁడు వాసవదత్త వాడని మాలాతిలకముచే పద్మావతిని సైసేసి ముచ్చట తీర్చుకొనెను. ఆ యలంకార మామెకు మున్ను వత్సరాజు నేర్పిన విద్య. కొంగ్రొత్త సొబగుచే మిక్కిలియు రాణించు కూఁతును - ఏకాంతముగఁ దల్లి చూచి అమ్మా! యీ మాలాతిలకము లెచ్చటివే యని ప్రశ్నవైచెను. ఆవంతిక యను యువతి తన మందిరములో నున్నదనియు నామెయే ఈ యలంకార రచనకు మూలమనియు పద్మావతి బదులు వలికెను. దానికి విస్మయంపడి తల్లి కూఁతుతో నిట్లు వచించెను—బిడ్డా! యిట్టి దొడ్డ శిల్పము నేర్చిన యామె యెవ్వతెయో మానుషకాంత మాత్రము కానేరదు. దేవతలు మునులు ప్రచ్ఛన్నముగా నొక్కొక్క సమయములో సజ్జనుల మందిరములు చొచ్చి వింతలు వినోదములు కావింతురు. ఆ చేఁతలు గుర్తించుటయే మానవుల విజ్ఞతకు మూలము. మున్ను కుంతిభోజుని యింటికి దుర్వాస మహామునులు వచ్చి కుంతి యొనర్చు నుపచారములు లెస్సగా ననుభవించి పరీక్షార్థమని యేవేవియో చేసి అన్నింటిని సైచిన యా కుంతిని మెచ్చుకొని తుదికిఁ గావలసిన వరములను బ్రసాదించి పోయిరి. ఆవంతికయు నట్లే నీ యింట నున్నదేమో! అమ్మా! నీవు మాత్ర మామెను గనుగలిగి చక్కఁగా జూచుకొనుము.

తల్లి చేసిన యీ హితోపదేశమునకుఁ బద్మావతి యెంతయు మోదమంది నానాఁడు వాసవదత్తను గౌరవ దృష్టితోఁ జూచుచుండెను. ఐనను వాసవదత్తా హృదయములోఁ బతివియోగ వ్యథాభారము పీఠము వెట్టెను. వసంతకుని వికారపుఁజేష్టలుమాత్ర మా కాంతకుఁ గొంత హృదయశాంతి కూర్చుచుండెను.

అచ్చట వత్సరాజు వేఁటలోఁ దిరిగి తిరిగి సాయంసమయమునకు లావాణకము వచ్చెను. బూడిద బుక్కుణమైన అంతిపురి యంతయు గనులార నా భూకాంతుఁడు చూచెను. దేవియు వసంతకుఁడు మంటలోఁ బడి కాలిపోయిరని మంత్రులు వినిపింపఁగా వత్సరాజు ప్రాణములు లేచిపోయెను. మొదలు నఱికిన తరువువోలెఁ దటాలున నేలమీఁదికి నొరిగి పోయెను. దుఃఖానుభవము తొలఁగించుటకో అన్నటులు జేనిని మూర్ఛ ఆవరించెను. కొంతవడికిఁ దెలివివచ్చి శోకము రేకెత్తగా వత్సరాజు బావురుమని బాలునివోలె నెత్తిగొత్తి విలాపముచేసి ప్రాణత్యాగమే కర్తవ్యమని రూఢి చేసికొనెను. కాని యంతలో నేదియో జ్ఞప్తికివచ్చి యాతఁ డిట్టులు తల పోసెను—ఔరా! నారదుఁడు మున్ను చెప్పినమాటలేమి? వాసవదత్తా గర్భమున విద్యాధర చక్రవర్తియై కాఁగల పుత్త్రరత్నము కలుగుననియే గదా ఆయన సెలవిచ్చెను. అది సత్యమేల కాదు! పైఁగాఁ గొన్నినాళ్ళు కష్టపుదినములుండుననియు - ఆయన అని యుండెను. ఎందులకో గోపాలకుఁడు అంతఁగా దుఃఖపడఁడే! యౌగంధరాయణాదులు సైతము స్తిమితము చెందియుందురేల! ఏమో!

కెవ్వరు చెప్పనేర్తురు? దేవి బ్రదికియే యున్నదేమో! ఒకవేళ - ఇది యేమైన నీతిప్రయోగ విశేషమో! కావచ్చు. కావున నెప్పుడో ఒకప్పుడు పత్నీ సమాగమప్రాప్తి కలుగ వచ్చు. ఇందలి ఫలితమేదో చూతముగాక. అని చింతించియు రెండ మూరాటమొందు మంత్రు లూరడింప నెట్టులో గుండె చిక్కఁబట్టుకొని కాలము నెట్టుకొని వచ్చుచుండెను. దేవీ గృహదాహవార్తలో రహస్యమును గోపాలకుఁడు తండ్రి కెఱింగింపను దూతను బంపెను. అద్దాన నుజ్జయినిలో నాత్మీయులలో నాందోళన మంతగాఁ గానరాకుండెను.

పద్మావతి పరిణయము

మగధరాజు చారులవలన లావాణకవృత్తాంత మంతయు నెఱింగి కాలజ్ఞుఁడు కావున మున్ను యౌగంధరాయణుఁడు తన్నుఁ గోరినమాట మనసునకుఁ దెచ్చుకొని తనకూఁతును పద్మావతిని వత్సరాజున కిత్తునని దూతను బంపెను. వాఁడును వేగమె వచ్చి వత్సరాజునకు మహామాత్యున కవ్వార్త విన్న వించెను. సమయోచిత వాక్యములు పెక్కులు వలికి మహా మంత్రి వత్సరాజు నంగీకరింపుమని మిక్కిలిగా వేఁడుకొనెను. ఓహో! యిందులకే దేవిని దాఁచియుంచి వీరందఱు ఈ 'తంతు' కావించిరి కాఁబోలు నని తేఁడు ఊహించి సరే యని తల యూఁపెను. అప్పుడే పెద్దలు సుముహూర్తము నిశ్చయించిరి. నేఁటి కేడవనాఁడు పద్మావతిని బరిణయ మాడుటకై మా ప్రభువు వత్సరాజు అచ్చటికి వచ్చునని యౌగంధరాయణుఁడు దూతముఖముగా మగధదేశాధీశ్వ రునకు సందేశము పంపెను.

దూత తెచ్చిన సందేశమునకు మగధరాజు సంతోషించి సర్వవిధముల సమ్మతించి వివాహప్రయత్నములో నుద్యుక్తుఁడాయెను. ఉత్సవ సంభారము లన్నియు సిద్ధమాయె. రాజకుమారి పద్మావతియు ననుకూలవరప్రాప్తి కెంతయు మోదమందెను. ఆవార్త వాసవదత్త నగరిలో విని వగవసాగెను. మొగము వెలవెలఁబోయెను. గుండె చెదరినట్లయ్యె. వసంతకుఁడు మాత్ర మావెను గంటఁ గని షెట్టుచు తలలో నాలుకవలె మెలఁకువగా మెలఁగుచు - పోనీ! అమ్మా! ఈ యుద్యమము మూలమున శత్రువు మిత్రమయినాఁడు. నీయెడ నీ ప్రాణప్రియుఁడు - అన్యథా సంచరింపఁడులే. అని యూఱట గొలుపుచు ధైర్యము చెప్పసాగెను.

పరిణయమహోత్సవ మాసన్నము కాఁగా వాసవదత్త పద్మావతికి వాడని వెనుకటి మాలాతిలకములను రచించి యుంచెను. వత్సరాజు సర్వపరివారమును వెంటవైచుకొని దండుతో మంత్రులతో నేడవనాఁడు పెండ్లికై తరలి వచ్చెను. మగధ దేశాధీశ్వరుఁడు మహానందభరితుఁడై చంద్రునకు నీరాకరుఁడు వోలె వత్సరాజున కెదురువోయి మురిపము కూర్చెను. వాసవదత్తను గలియుటను నవకాశము తప్పక ప్రాప్తించుననను - ఆశయే లేనిచో - ఈ వివాహ మహోత్సవములో వత్సరాజు పాల్గొననే పాల్గొనఁడు. పౌరజనము గుములుగట్టి ప్రజానేత్రోత్సవ కరుండైన వత్సరాజును గన్నుల కఱవుతీఱఁ గాంచఁగా నుత్సహించిరి. సకల సంరంభములతో పెండ్లివారు నగరు చొచ్చిరి. అంతిపురిలోని

కాంతలు జగన్మోహనుం డగు వత్సరాజునుగాంచి రతీహీనుం డైన మన్మథుండే యని కుతూహలముతోం గొండాడిరి.

పేరంటాండ్రతో నిండి పెండ్లి యిల్లు కిటకిట లాడు చుండెను. పురోహితబృందము వేదఘోషము మింటికెగసె. వేదీధూమ మెల్లయెడల బెల్లురేంగెను. వధూవరులు వివాహ వేదిక నధిష్ఠించిరి. పద్మావతిదాల్చిన మాలాతిలకములను వత్సరాజు కన్నులంజూచి యెక్కడివో యీ కన్నె కియ్యవి యని యాలోచనములో మునింగి పోయెను. మంత్రతంత్ర ములలో మహావాద్య ఘోష పరంపరలలో బురోహిత వర్గపు హెచ్చరికలలో పద్మావతీ వత్సరాజుల పాణిగ్రహణ మహోత్సవము చక్కంగా ముగిసెను. పద్మావతీ కరగ్ర హణమే పృథివీ కరగ్రహణమునకు నాందీప్రస్తావ మాయెను. అల్లునకు మగధరాజు సగౌరవముగం జదివించిన రత్నసము చ్చయము చూడంగాం జూపఱుకన్నులు గిఱ్ఱునం దిరిగి పోయెను. బాంధవుల కెల్లరకు వస్త్రాలంకారములు కట్నము బెట్టను బ్రసాదించిరి. కట్నంబులు చదివించిరి. చారణులు పాడిరి. వారాంగన లాడిరి. ఎల్లవారికిం గన్నుల యెదుట కళ్యాణలక్ష్మి కళకళలాడుచుం దాండవించెను. ఆ మహో త్సవ సమయములో యౌగంధరాయణుం డుపాయమున వత్సరాజు విషయమై అద్రోహప్రమాణము నగ్నిసాక్షిక ముగా మగధరాజుచేం జేయించెను. వాసవదత్త మాత్రము కొండలమందిన డెందముతో కోటలో నెక్కడనో అణంగి మణంగి భర్తృవిజయమునే కోరుచుం బగటిచందురుండువోలె బ్రభాహీనయై యొదిగి యుండెను.

అంతిపురిలోనికిఁ గనుక వత్సరాజు పోయెనా తన మంత్రమంతయు బట్టబయలగునని యౌగంధరాయణుఁ డూహించి తన నగరమున కిదిగో వత్సరాజు తరలుచున్నాఁ డని మగధరాజున కెఱింగించెను. వల్లెయని యాతఁడు సర్వ సన్నాహము లొనర్చెను. ఆ మాట మహామంత్రి వత్సరాజు నకు సైతము తెలియఁ జెప్పెను. అతఁడును గాదనఁడయ్యె. అంపకపు వేడుకలు — అచ్చట ముచ్చటలు లెస్సగాఁదీరెను. ఆత్మబంధువులు కొందఱు వెంటఁ జనుదెంచుచుండఁ బ్రయాణ మైన పద్మావతిని గైకొని మంత్రులతో హితులతో వత్స రాజు స్వదేశమునకు దరలెను. పద్మావతి యానతిని సేనకు వెనుక వైపునఁ గతిపయపరివారము వాసవదత్తను వసంతకుని దీసికొని వచ్చుచుండెను.

క్రమముగ వత్సరాజు పద్మావతీ సహితుఁడై లావాణ కము చేరెను. కాని యాతని డెందమునకు వాసవదత్త జ్ఞప్తికి వచ్చి స్థిమితము చిక్కకదాయె. ఇంతలో నంతవఱకుఁ జను దెంచిన వాసవదత్త ఆ పరివారము నట్టె విడనాడి అద్దమ రేయి గోపాలకుని మందిరము చొచ్చెను. అచ్చటఁ దోఁబుట్టు లిర్వురు బావురుమని యేడ్చి ఒకరి నొకరు చూచుకొని యూవటిల్లిరి. యథాసంకేతముగ నప్పుడే యౌగంధరాయణుఁడు రుమణ్వంతుఁడు దేవివద్దకు వచ్చిరి. వారామెను సమయోచిత వాక్యములతో నోదార్చిరి; కర్తవ్య మెఱింగించిరి. ఇంతలో పద్మావతి పరివార మామె సన్నిధికి నరిగి అమ్మా! ఆవంతికమ్మ మాతో నింతదూరము వచ్చివచ్చి తీర — ఇక్కడ మా మాట వినక రివ్వున రాజ

కుమారుఁడు గోపాలకుని యింటికి నడచినది. అదేమో తెలియదని విన్నవించిరి: వత్సరాజు ప్రోల – ఆ విన్నపము విన్న పద్మావతికి డెందములో సందియము పొడమెను. అట్టె తల పంకించి యుంకించి యామె వారితో నోయీ! మీరు పోయి చెలీ! నీవు నాకు - ఇల్లడ మైతివి. నే నెక్కడ నుందునో అక్కడనే నీవు సైత ముండుట న్యాయము. అన్యత్ర నీ కేమి పని! కావున వేగమె నావద్దకు రావలయు నని నా మాటగాఁ జెప్పుఁడని గట్టిగా శాసించెను.

## పునస్సమాగమము

ఆవల వత్సరాజు పద్మావతితో నేకాంతముండి యెవో మాటలలో నీ కీ మాలాతిలకము లెవరు రచించి యిచ్చిరని ప్రశ్నించెను. ఆమెయు నిట్లనియె:—మా యింట నొకా నొక బ్రాహ్మణుఁ డొకనాఁ డొక యువతిని ఉంచి పోయెను. ఆమె పేరే అవంతిక. ఆమె యద్భుత శిల్పమే—ఈ మాలా తిలకములు. అది వినెనో లేదో - ఆమెయే వాసవదత్త యని వత్సరాజు నిశ్చయించి రివ్వున గోపాలకుని యింటికిఁ బోయెను. లోపల దేవీ గోపాలకులు వసంతక యౌగంధ రాయణ రుమణ్వంతులు మంతనము లాడుచుండిరి. విరహ వ్యథాభారదోదూయమానమానసుండైన వత్సరాజు ప్రియా సందర్శనముఁ జేసి శోకాకులుఁడై నేలమీఁద నొరిగి వ్రాలెను. నియమక్షామవదనారవిందయగు వాసవదత్తయు డెందము కొందల మందఁ దన్నుఁ దా నిందించుకొనుచు విలపింప సాగెను. ఆదంపతుల దురవస్థగాంచిన యౌగంధరాయణుఁడు

సైతము మహాధీరుఁడయ్యుఁ గంపిత చిత్తుఁడై కన్నుల నీరు పెట్టుకొనెను. ఈ కల్లోలము సర్వము పద్మావతియు విన్నదై గుండె చెదరి బెగ్గడిల్లి యక్కడికే వచ్చి పడి యంతయు గుర్తించి యట్టె నిర్విణ్ణయై దుఃఖానుభూతిలో వాసవదత్తా వత్సరాజులకుఁ బాలికాపుగాఁ బరిణమించెను. అయ్యో! నా ప్రాణప్రియున కిట్టి యెడరు కలిగించితినే! నా బ్రదుకు కాల్పనా! ఛీ! పాపాత్మురాలను. అని యనేకవిధముల వాసవదత్త వాపోవసాగెను. అంతయుఁ బరిశీలించి మదిలో ధైర్యము తెచ్చుకొని సమయజ్ఞుఁడగు యౌగంధరాయణుఁడు వత్సరాజుతో నిట్లని విన్నవించెను:- దేవా! స్వస్తియగుఁ గాత. మగధదేశాధీశ్వర సుతాప్రాప్తిచే నీకు సామ్రాజ్య సౌఖ్యము దక్కును గాక. ఇది యంతయు నా చూపిన వ్యూహము. ఇందులో దేవిదోష మేదియు లేదు. ఈ యెడఁబాటులో - ఈ దురవస్థలో - ఈ మహాదేవిశీలమునకు సపత్ని యగు నీ పద్మావతియే సాక్షిణి. అంతయు సావధానముగఁ గాంతురుగాక.

అది విని పద్మావతి పొంగిపోయెడి హృదయము నణంచుకొంచు అయ్యయ్యో! ఈమె శీలము నిర్ధరింపవలసిన అక్కఱయే లేదు. తప్పదందురా! ఇదిగో నేనె అగ్నిప్రవేశమైనను జేసి నిర్ధరించి చూపెదను. అని యెల్లరు వింతపడునట్లు ప్రతిన వూని వచించెను. కాదు కాదు; నాదే దోసము. నాకోసమే గదా దేవి యింతగా మహాక్లేశ మనుభవించుట్లాయె నని వత్సరాజు బెగ్గడిల్లుచుఁ బలికెను. ఏలినవారి సంశయము లేశమైన నిలువకుండుటకు - అగ్నిప్రవేశము

చేయవలసినది నేనే గదా! అని వాసవదత్త గట్టిగా మోటు చఱచెను. ఈ మూవురి మాట లాలకించి మహామతి యగు యౌగంధరాయణుఁడు తూర్పుదెసకుఁ దిరిగి ఆచమనము చేసి పరిశుద్ధుఁడై యిట్లు పలికెను:—ఓహో! లోకపాలకులారా! నారాజునకు నేను మేలు సేయువాఁడనేని దేవి వాసవదత్త పరిశుద్ధాంతరంగయే అగునేని - ఈ యున్న సభ్యులెల్లరి ముందర - ఆ మాట చెప్పుఁడు. లేదా! కాదా! ఇదిగో - ఇప్పుడే యీ దేహము విడచివైచెద నని ప్రతిజ్ఞగాఁ బలికెనో లేదో రాజా! నామాట వినుము. ఏ యౌగంధరాయణుఁడు నీకు మంత్రిగా నుండ నోచితివో - ఏ నీకుఁ దొలిపుట్టువులో దేవతయైన - ఈ వాసవదత్త ధర్మపత్నిగా ఆయెనో - ఆ నీవు ఒక్కఁడవే అన్నింట ధన్యుఁడవు. కృతార్థుఁడవు. ఈ మెలో దోసము లవలేశము లేదు. అని అశరీరవాణి వినవాయెను.

తొలుకాఱు నుఱుములకు నట్టులెత్తిన నెమిళ్ళ పిండు వోలె నందలివా రెల్లరు కంగున మాఱుమ్రోగు నా దివ్య వాక్కును విని హృదయతాపము తీఱి మెడలు సాఁచి పరమ సౌఖ్య మనుభవించిరి. వత్సరాజు గోపాలునితో ముచ్చట లాడుచు మహామంత్రి యౌగంధరాయణుని చేతలు కొండా డుచు - ఇఁక నీ భూమండల మెల్ల నా యఱచేతిలోనిదే గదా యని దిటవుగ భావించెను. రూపము దాల్చిన రతి నిర్వృ తుల భాతి రాణించుచు నొండొరులకు హృదయమిచ్చి మెచ్చుగాంచిన యా నాయిక లిద్దఱు కుడియెడమలై కడుం గడు సౌఖ్యము లిచ్చుచుండ వత్సరాజు బ్రహ్మానంద సబ్రహ్మ చారియగు దాంపత్యసౌఖ్య మనుభవింపఁ దొడంగెను.

౭

## విస్రంభగోష్ఠి

ఒకనాఁడు వత్సరాజు వాసవదత్తా పద్మావతులతో నేకాంతములో పానీయములు కుడిచి విలాసములు జరిపి గోపాలక వసంత కరుమణ్వంతులతో మహామంత్రి యౌగంధ రాయణునితో విస్రంభగోష్ఠి నెఱపెను. అందు - నేవో మాటల వెంబడి తన విరహప్రస్తావము మాట వచ్చి వారెల్లరు మక్కువ పడి వినుచుండఁగా వత్సరాజు - ఈ కథ వక్కాణించెను.

### ఉర్వశీపురూరవులు

పూర్వము పురూరవుఁ డని పేరు కల పరమవైష్ణవుఁ డైన మహారాజొకఁ డుండెను. ఆతఁడు భూలోకములోనే గాదు; స్వర్గములో సైతము నిరాఘాటముగఁ దిరుగుచుండును. ఒకనాఁడు నందనోద్యానవనములో నాతఁడు వాహ్యాళి యొనర్చుచుండ మదనమోహనాస్త్రమైన యుర్వశి చూచి వాని చక్కదనమునకుఁ జొక్కి యక్కడనే మూర్ఛ వోయెను. ఆమె బ్రదుకునో లేదో అన్న సందియము దాఁక వచ్చెను. చెలిమికత్తెలు రంభాదులు డెందములు దురపిల్ల దురవస్థలోఁ బడిపోయిరి. లావణ్యరసతరంగిణి యగు నా యచ్చరం గాంచి పురూరవుఁడు సైతము మూర్ఛలో మునిఁగి పోయెను.

ఇది యిట్టు లుండ సర్వజ్ఞుఁడు నారాయణుఁడు నారదుని బిలిచి దేవర్షీ! పురూరవుఁడు నందనోద్యానములో

నుర్వశిని జూచి ముగ్ధుఁడై యున్నాఁడు. నీవు వెంటనే పోయి నామాటగా దేవేంద్రునికిఁ జెప్పి యామెను పురూరవున కిప్పింపవలయునని యాజ్ఞాపించెను. నారదుఁడు చిత్తమని పలికి వీడ్కొని దివ్యనందనమునకుఁ బోయి మూర్ఛలో మునిఁగిన పురూరవుని మేలుకొలిపి ఏమయ్యా! నీకోసమే వచ్చితిని. నారాయణుఁడు నిన్నుఁ గనికరించి నన్ను నీ వద్దకుఁ బంపినాఁడు. రావయ్యా, రా! యని యూఱడించి వానిని దోడ్కొని యింద్రుని సమీపించి శ్రీహరి యానతిని దెలిపి యప్పుడే వానికి ఊర్వశి నిప్పించెను.

ఉర్వశీ పురూరవులు భూలోకమునకు వచ్చిరో లేదో దేవాంగనా దర్శనమునకై మర్త్యలోక మంతయు నెగఁబడి వచ్చెను. నాఁడు మొదలు వార లిర్వురు మోహపాశావృతులయి నిమేషమైన నెడఁబాయక ప్రొద్దులు పుచ్చుచుండిరి. ఇంతలో పాపిష్ఠియుద్ధ మొకటి దేవతలకు దానవులకు జరిగి దేవేంద్రుఁడు కబురంపఁగా పురూరవుఁడు స్వర్గమునకుఁ బోవలసి వచ్చెను. అయ్యెడఁ బేరుమోసిన దానవ నాథుఁ డొకఁడు యుద్ధములో నీల్గఁగా - ఆ సంబరము పట్టలేక దేవేంద్రుఁడు మహోత్సవము జరిపించెను. అందులో నాటలు పాటలు పానలీలలు విలాసగోష్ఠులు పెల్లుగా జరుపఁ జొచ్చిరి. ఆచార్యుఁడు తుంబురుఁడు ఆధ్వర్యము వహింప నృత్యములో రంభ యేదో లోపము చూపెను. అది వెల్లఁగి పురూరవుఁడు పదిమందిలోఁ బకాలున నవ్వెను. దానికి రంభ చిన్నవోయి ఓహో! రాజా! యిది దేవతానృత్యము. నేనో దివ్యను గావున నిందలి దోసము నా కెఱుక కావచ్చును.

నీవో మానిసివి. ఇది నీ వెట్లు గుర్తించితివో! అని యాసు వ్రాని యడిగెను. ఓహో! అదియా కథ! నీ గురుఁడు తుంబురుఁడుకూడ గుర్తింపలేని ఘట్టమును ఉర్వశీసాహచర్యమున నేను గుర్తింపగలిగితినని మానవనాథుఁడు బదులు చెప్పెను. అంతట తుంబురుఁడు కోపగించి పురూరవునితో 'నోయీ, కృష్ణారాధన పర్యంతము ఉర్వశితో నీకు వియోగము కలుగుఁగాక' యని పాపము శాపమిచ్చెను. అది విని వివర్ణుఁడై యాతఁడుపోయి భూలోకములో పిట్టపిడుగువంటి యా దుర్వార్త ఉర్వశి చెవిలోఁ బడవైచెను. ఇంకేమి! ఎక్కడనుండి వచ్చిరో పాపము! గంధర్వులు గుంపులుగట్టి వచ్చి రేనికంటి కెఱుకలేకయే ఆబిడ నెక్కడికో తోడ్కొని పోయిరి. అదే శాపమునకు నుపక్రమణికయని ఱేఁడు భావించి బదరికాశ్రమము వోయి శ్రీహరి పాదారవిందములు సేవింపఁ దొడఁగెను. ఉర్వశియు వియోగవ్యథాభారదగ్ధయై గంధర్వలోకములో మృతప్రాయురాలై విచేతనయై శాపావసాన ప్రత్యాశచే ప్రాణములు బిగఁబట్టుకొని యల్లె పడియుండెను.

ఇంతలో పురూరవుఁడు తీవ్రమగు తపశ్చరణముచే నారాయణుని మెప్పించెను. శాపావసాన మేర్పడి గంధర్వులామెను దెచ్చి వాని కొప్పగించిరి. అప్పుడు భూలోకవాసులయ్యు వారు స్వర్గలోక భోగములు చవులూర ననుభవింపఁ జొచ్చిరి.

ఈ కథను విన్నదై పతివియోగ సహనవిషయమున ధ్వనించిన యుపాలంభమునకు సిగ్గుపడిన దేవిని గాంచి యౌగంధరాయణుఁడు రాజుతోఁ దా నీ కథను జెప్పఁ బూనెను:—

## అహితసేనుఁడు

దేవ! మున్ను సిరి కాటపట్టయిన తిమిరయను నగర మొకటి కలదు. దానికి ప్రభువు - అహితసేనుఁడని ప్రఖ్యాతుఁడగు రాజు. ఆతనికి భూలోకరంభయైన భార్య యుండెను. ఆమెపేరు తేజస్వతి. ఆ రాజు - ఆమె యెడఁబాటును లవలేశ మేని సహింపనోపఁడు. సర్వదా ఆమె సాహచర్యమును వీడనేరక తత్స్పర్శైకాగ్రతఁ జేసి అంగరక్షా సైతము తొడుగుట మానివైచెను.

ఆతని కొకప్పుడు జీర్ణజ్వరముపుట్టి మహోపద్రవ మనిపించెను. వెజ్జు లెన్నో చికిత్సలు చేసిరి. భార్యా సాంగత్య మపథ్యమని నిషేధించిరి. ఆ దిగులువలన ఱేనికి హృదయములో మందులకు సైతము లొంగని వ్రణ మొకటి లేచెను. ఉపాయజ్ఞులగు వైద్యులు భయముచేఁగాని శోకముచేఁగాని ఆ వ్రణము పగిలిపోవునని మంత్రులకుఁ దెలియఁజెప్పిరి. పెనుబాము వీపుమీఁదఁ బడినను దొట్రువడని యా ఱేనికి ప్రబల శత్రువు లెత్తివచ్చి యంతిపురిలోఁజొచ్చినను గలఁతపడని - ఆ ధీరునకు భయ మెట్లు కలుగునో శోక మెట్లు పొడమునో మంత్రులకుఁ దోపదాయె. కింకర్తవ్యతా మూఢులయి యా మంత్రులు దేవితో మాటలాడి తుది కామె మరణించెనని ఱేనికి వినిపించిరి. అపరాని యా శోకవేగముచే భగ్గున వ్రణము వ్రీలిపోయెను. రోగము కొంతకుదిరి హాయిచిక్కిన పిదప మంత్రులు ఱేనికి మహాదేవి నర్పించిరి. ప్రాణము లిచ్చిన యా దేవిని రాజెంతో ముచ్చటపడి మెచ్చుకొనెను. ఔరా! దాఁగియుంటివా యని పల్లెత్తిమాటయు ననఁడు.

దేవా! పతిహిత మొనర్చుటయే దేవీత్వమునకు హేతువు గాని ప్రియవాక్యములు పలికినంత మాత్రాన దేవీశబ్దమునకుఁ దగదు. రాచకార్యములలో చిత్తైకాగ్రత కలిగి కనుగలిగి యుండుటయే మంత్రిత్వపు లక్షణము. అది యెఱింగియే మేము బద్ధశత్రువయిన మగధరాజుతో సంధి కుదుర్పను- అఖండ భూమండలకేలను- ఈ యుపాయము పన్నితిమి. నీమీఁది భక్తిప్రపత్తులచే నిట్టి వియోగభార మోర్చిన యీ దేవిని నీకు సర్వదా ఉపకారిణియే గాని - అపకారిణి కాదు.

ఆ మాట మహామంత్రి చెప్పఁగా వత్సరాజు విని తానే యపరాధి నని యెంచుకొని వారితో నిట్లనియె:— ఓహో! మీ నేర్పు నేనెఱుంగనా! మూర్తీభవించిన రాజనీతి వోలె - ఈ దేవి మీ మాట జవదాఁటక సర్వభూమండలము నాకుఁ గట్టబెట్టినది. కాని యుపరిచయమునఁ జేసి యీ మాట నేనంటిని గాఁబోలు! అని జేఁడు నాఁడు దేవికి హృదయశాంతి చేకూర్చెను.

ఇంతలో నీ రహస్యమంతయు నెఱింగి మగధరాజు దూత ముఖమున వత్సరాజున కిట్లని కబురుపంపెను:-ఓహో! మిత్త్రమా! నీ మంత్రుల వలలోఁ జిక్కుకొని మోసపోయితిమి. అయినదేమో అయినది. ఇఁక నీ వెట్లు ప్రవర్తించిన మా డెందము తల్లడమందదో అట్లే ప్రవర్తిల్లెదవు గాక. నా విని వత్సరాజు దూతను సంభావించి యాతనిని పద్మావతి యొద్దకు ప్రత్యుత్తరముకోసమని పంపెను. పద్మావతి యాతనిఁ గాంచి వాసవదత్తాసన్నిధిలో యోగక్షేమము లారయఁ జూచెను. దూత తండ్రిమాటగా నిట్లు నుడివెను:-పుత్త్రి!

నిన్నుఁ గనిన నా జన్మము వ్యర్థమాయె. నిన్ను మోసము చేసి కొంపోయిరి. నీ భర్త అన్యాయరక్తచిత్తుఁడు. నీ కర్మ మెట్లున్నదో యెఱుంగను. ఈ సందేశము పద్మావతి విని వాసవదత్త వినుచుండఁగా ప్రతిసందేశ మిట్లు పంపెను:- ఓయీ! నా మాటగా మా అమ్మతో నాయనతో నిట్లనుము. ఏల మీ కిట్టి చింత? నా భర్త నాయెడ అత్యంతము కరుణ గల ప్రభువు. వాసవదత్తాదేవియు నాయందు మిక్కిలి మక్కువ కలిగి అక్కవలె నున్నది. ఓ తండ్రీ! నా ప్రాణమే ముఖ్యమని నీవు భావింతువేని నా పతిదేవుని విషయమయి యీ విపరీత చింత మానవలెనని నా ప్రార్థనము. ఈ మాటకు వాసవదత్త మిక్కిలిగా సంభావించి - యా దూతను సత్కరించి ప్రయాణమునకు సెల వొసంగెను. దూత వోయినపిదపఁ బుట్టింటివారు తలంపునకు వచ్చుటను పద్మావతి చింతాక్రాంత యయ్యెను. ఆమెను వినోదపెట్టుట కర్తవ్యముగా నెంచియు వాసవదత్త హెచ్చరింపఁగా వసంతకుఁ డీ కథను ముచ్చటించెను.

## సోమప్రభ

వింటిరిగదా పాటలీపుత్రమని జగత్ప్రసిద్ధమైన పట్టణమును. అందు ధర్మగుప్తుఁడను వైశ్యుఁడు మహాధనవంతుఁడు- ఉండెను. ఆతని యిల్లాలిపేరు చంద్రప్రభ. ఆ దంపతులు సంతతిలేక చిరకాలము ఎన్నో నోములు నోఁచిరి. దైవికముగా చంద్రప్రభ గర్భము దాల్చి నవమాసములు మోసి సర్వాంగసుందరియైన కన్యాలలామను గనియెను. పుట్టఁగానే

యా బిడ్డ యొడలికాంతిచే మేడయంతయు ధగద్ధగాయిత మొనర్చుచు నడిమంచముమీఁద లేచికూర్చుండి చక్కఁగా మాటాడఁ జొచ్చెను. పురుటింటిలోని యమ్మలక్కలు విస్మయ భయాధీన మనస్కలై - ఆవింతవార్త ధర్మగుప్తుని చెవిలో వైచిరి. వాఁడును భయంపడి గుటకలు మ్రింగుచు మంచమువద్దకు వచ్చి యొంటరిపాటుగా నా కన్నెకు మ్రొక్కులు వెట్టి అమ్మా! ఎవరమ్మా నీవు? నా యింటిలో నవతరించితివి? అని గడగడ వడఁకుచు నడిగెను. తండ్రీ! నీవు నన్నెవరికిఁ గాని యీయరాదు; ఎన్నాళ్లు నీ యింట నుందునో అన్నాళ్లు నీకు నిత్య శుభములే. తక్కిన విషయముల మాట యెత్తనేల! అని ఆమె ప్రత్యుత్తర మిచ్చెను. ఆ మాటవిని ధర్మగుప్తుఁడు భయము తీఱక ఆమె పోయినదని యపవాదువేసి చాటుగా నామెను బెంచుకొనుచుండెను.

అందచందములలో నామెకు భూతలములో నీడుజోడే లేదు. ఆమె పేరు సోమప్రభ. అగణ్య రూపలావణ్యములతోఁ బాటు దినదినాభ్యుదయముగా నామె యెదుగుచుండెను. ఒకనాఁడు మేడమీఁద వేడుకగాఁ దిరుగాడుచు వసంతోత్సవమును దిలకించు చుండఁగా గుహచంద్రుఁ డను కోమటిబిడ్డ యామెను గాంచి గాడుదగిలి మూర్ఛవోయి కొంతవడికిఁ దెప్పిఱిల్లి కొంప చేరెను. పాప మాతని కర్మమేమొ నాఁటఁ బట్టి యాతఁడు చీఁకునఁ జివికి నవసి యెండిపోవసాగెను. ఆతని చెలికాండ్ర మూలమునఁ దల్లిదండ్రు లాతని దురవస్థను గుఱుతించిరి. తండ్రి గుహసేనుఁడు బిడ్డకోసమని తెగించి పీఁధనిబడి పోయిపోయి ధర్మగుప్తునితో - ఆ మాట చెప్పెను.

ఓయి వెఱ్ఱివాఁడా! నా కెక్కడిదోయి పిల్ల! అని ఆతఁ డీతని నిరాకరించెను. ఇంటిలో పిల్ల నుంచుకొని లేదని బొంకినాఁ డీ కోమటి యని ఆ కోమటి రూఢిచేసికొని మొగిరి పడుచు నింటికిఁబోయి మంచము వట్టిన బిడ్డను జూచి మనస్సులో నిట్లని వ్యూహము వన్నెను:- ఈ మనువు కుదుర్చుట రాజు చేతిలో నున్నది. ఆయన కొలువులోఁ గొన్నాళ్ళు నేను-అంటఁగ్రాఁగి యుంటినిగదా! ఆ మాత్రము సాయము చేయఁడా! అని దిటవుచేసికొని విలువైన యొక యుత్తమ రత్నమును నజరువెట్టి యొకనాఁడు జేని కా కోఁక మనవి చేసికొనెను. ఱేఁడును సంతసించి యాతనికిఁ దన సేనాపతిని సాయమంపెను. వాఁడును దండుతోఁ దరలి దర్పము చూపి ధర్మగుప్తుని యిల్లు ముట్టడించిరి. నాఁటితో సర్వనాశనము తప్పదని ధర్మగుప్తుఁడు గడగడ లాడుచుండ సోమప్రభ డగ్గఱకు వచ్చి తండ్రీ నన్నిచ్చి వేయుము; నాకోసమని నీ కేల యీ యెద్దడి? భర్త నన్నెన్నఁడు శయ్యకుఁ జేర్పరాదను నియమము పెట్టి- ఆ మాట నీ వియ్యంకునికి గట్టిగాఁ జెప్పి నన్నాతని కిచ్చివేయు మని దారి చూపెను. సరేయని ధర్మగుప్తుఁడు వెలుపలికివచ్చి వియ్యము వారితో నా యొడంబడిక వినిపించెను. గుహసేనుఁ డా నియమమునకు లోలోన నవ్వుకొనుచుఁ గాదనక సుముహూర్తము నిశ్చయించి వివాహ ప్రయత్నము లొనర్చెను.

యథావిధిగఁ బెండ్లి ముచ్చటలు తీఱెను. ఆవల సోమప్రభను గుహచంద్రుఁ డింటికి గొంపోయెను. ఇంటికిఁ జేరిన వెంటనే తన భార్యతోఁ దా నుండుట యొక యాక్షేపమా!

సర్వము నీ యిష్టమని కోడుకునకుఁ గోమటి బోధించెను. ఆ ఘట్టము విన్నదై కోడలు మామవంక నెగాదిగఁ జూచి తర్జనితోఁ దీవ్రముగా బెదిరించెను. ఆ దెబ్బకుఁ గోమటి గుండెలు బ్రద్దలై పంచప్రాణములు పైకి లేచిపోయెను. తక్కినవారును బిత్తఱవోయి తైతక్కలాడిరి. త్రుటిలోఁ దండ్రి గతించెనే! మహామారి నా యింటఁ జొచ్చెనే! యని కోమటి కుఱ్ఱవాఁడు కుమిలి కూలారెను. లాభము లేదని యామెతో భోగముల మాటయే యెత్తక అన్నియు మాను కొని బ్రదుకు జీవుఁడా యని అసిధారావ్రతముతో నెట్లో కాలము నెట్టుచుండెను. కాలక్రమముగ నాతనికి విరక్తి జనియించి నిత్యవ్రతములు దానధర్మములు సంతర్పణములు హెచ్చు కాఁజొచ్చెను. వచ్చినవారిని గాదనక దివ్యరూపిణి యైన యా యిల్లాలు మౌనవ్రతురాలయి నిచ్చలు భోజనములు పెట్టుచు దక్షిణల నొసంగుచుఁ గీర్తిని గడించుచుండెను.

ఒకనాఁ డొక బ్రాహ్మణవృద్ధు భోజనమునకు వచ్చి త్రిలోకసుందరి యగు సోమప్రభను జూచి కుతూహలపడి గుహచంద్రునితో-ఈ యువతి నీకేమి కావలెనని యడిగెను. ఏదోలే యన్నటులు ముఖభావము చూపిన యా వైశ్య కుమారుని పదేపదే బ్రాహ్మణుఁడు హెచ్చరించెను. తప్పని సరియాటచే నాతఁ డాతని కామెవృత్తాంతమంతయుఁ బూస గ్రుచ్చినటులు ఖిన్నమనస్కుఁడై వినిపించెను. అప్పుడు బ్రాహ్మణునకు జాలి కలిగి వాని కోరికి యీడేరుటకయి అగ్న్యారాధన మంత్రము నుపదేశించెను. ఏకాంతములో గుహచంద్రుఁ డా మంత్రమును జపించుచుండ - అగ్నిలో

నుండి దివ్యపూరుషుఁ డొక్కఁడు ఉద్భవించెను. వినమితగాత్రుఁడై గుహచంద్రుఁ డాతనికి మ్రొక్కఁగా బ్రాహ్మణరూపధారియగు నా యగ్నిహోత్రుఁడు ఓయీ! నీ యింటనే భుజించి యీ రేయి యుందును. తత్త్వమెఱింగించి నీ మనోరథమును సాధింతునని చెప్పి ఆతనియింటనే కాలము గడుపుచుండెను. ఆ రేయి తక్కిన విప్రులతోఁ బాటు - ఆ దివ్యపూరుషుఁడును భుజించెను. ఆవల గుహచంద్రునితోఁ గలసి జాము సేపు మేలుకనియే పరుండెను. అందఱు నిద్రావస్థలో నుండఁగా సోమప్రభ బయలు వెడలెను. వెంటనే యా బ్రాహ్మణుఁడు గుహచంద్రుని నిద్రలేపి నీ భార్య వృత్తాంతమెఱుంగను రావోయి నా వెంటనని పిలిచి యోగమాయచే నాతఁడు తానును దుమ్మెదలై యెగిరిపోయిరి. ఆ సుందరి ఊరు దాఁటి చాల దూరము పోయెను. ఇర్వురు నామె వెంటనే గూఢముగఁ బోవుచుండిరి. వారి కొకచోట నొక గొప్ప మఱ్ఱిచెట్టు కానవచ్చెను. దాని విస్తారము చెప్ప నలవికాదు. దానిక్రింద మనోహర వీణావేణునాదములతో మధురసంగీతకము విననాయెను. మ్రాని మీఁద మహాసనము వైచుకొని దివ్యకన్యక యొక్కతె కానవచ్చెను. తన భార్యయాకృతియే ఆమెయందును గుహచంద్రునకు స్ఫురించెను. ఇంతలో నాతని భార్యయు లావణ్య సర్వస్వకోశాధిష్ఠానదేవతయోయన విరాజిల్లుచు నామె కుఱంగట నర్థాసనమునఁ గూరుచుండెను. త్రిజగన్మోహనాకారముతో దేదీప్యమానముగ వెలుంగు రమణీమణుల నిర్వురనుజూచి గుహచంద్రుఁడు ముగ్ధుఁడాయెను. కలయో! భ్రాంతియో! ఉభ

యమో! సత్సంగతి ఫలితమో! ఏమో యిది యని యేమియుఁ దోఁపక ఆ వైశ్యుఁడట్లే నివ్వెఱపడి చూచుచుండెను. ఆకన్నెలు తీవికిఁదగిన భోజ్యములు భుజించి దివ్యాసవము పానముచేసిరి. విలాసమగు గోష్ఠిలోఁ గొంత ప్రొద్దు కడపి అక్కా! నేఁడు మహాతేజస్వియగు బ్రాహ్మణుఁడొక్కఁడు మా యింటికి దయచేసినాఁడు. అద్దాన నా కేదో వెఱపుగా నున్నది. పోయివత్తునని పలికి అక్కవద్ద సెలవు గైకొని చెట్టుదిగి ప్రయాణమయ్యెను. తుమ్మెదరూపును దాల్చిన యా యిర్వురు తోఁడుగా ముందెవచ్చి యథాప్రకారముగ నింటిలోఁ బరుండిరి. సోమప్రభయు వచ్చి గుట్టుగ నింటిలోఁ బరుండెను.

అప్పుడు దివ్యపూరుషుఁ డా వైశ్యకుమారునితో నిట్లు వచించెను:- ఓయీ! చూచితివి గదా దృశ్యము. నీ భార్య కేవలము మానవకాంతగాదు. అచ్చముగ దివ్యాంగన. ఈమె తోఁబుట్టువును సైతము చూచితివిగదా! దివ్యాంగనకు మానవునితోడి పొందు - ఎట్లు పొసఁగును? ఇంక నీ మనోరథ మెట్టు లీడేరునో చెప్పెదను వినుము:-నీవు చేయవలసిన పనులు రెండు కలవు. ముందుగ ద్వారముమీఁద వ్రాయవలసిన మంత్ర మొకటి యున్నది. దానికిఁ దోడుగ బాహ్యయుక్తియుఁ జెప్పెద నాచరింపుము. కార్యసిద్ధికి మంత్ర మొక్కటే చాలినదయ్యు అగ్నికి వాయువుతోడు అన్నట్లు ఈ యుక్తియు దానికిఁ దోడయి తద్దయుఁ బెంపు గూర్చును. అని యా మంత్రము గుహచంద్రున కుపదేశించి యుక్తియుఁ జెప్పెను.

వఱువాత లేచి వైశ్యకుమారుఁడు కాల్యములు తీర్చు కొని భార్య పరున్న యింటి ద్వారము మీఁద-ఆ మంత్రము వ్రాసి పెట్టెను. రెండవ సాధనము సైత మీ తీరుగఁ జూపఁ దొడంగెను. నాఁటి సాయంకాల మాతఁ డమూల్యములగు నాభరణాదికములను దాల్చి సోమప్రభ చూచుచుండఁగా నొక వెలయాలితో సరససల్లాపములు సాగింపఁజొచ్చెను. ఆ దృశ్యముగాంచి సోమప్రభ మంత్రరుద్ధ భుజంగివోలె నేమియుఁ జేయలేక మానవ్రతము మాని ఎవతె యీబిడ! యని పెనిమిటి నడిగెను. ఇది యొక వేశ్య; నాయందు దీనికిఁ బెద్దయు ననురాగముకద్దు. దీని కోరికి తీర్చను ఇదిగో దీని యింటి కిప్పుడే పోయెదనని - ఆ తరుణితో నాతఁ డబద్ధమే చెప్పెను. అప్పటికి బుద్ధి తిరిగి సోమప్రభ ఆతని సొగసునకుఁ జొక్కి ఆతని వైపు ఓరచూపులు చూచి కనుబొమలు ముడి వడఁగా నెడమచేత వానిని నివారించుచు సరే తెలిసినది. ఓహో! ఇందులకా ఈ వేషము! ఈ ఒయ్యారము! చాలుఁ జాలు. ప్రయాణము కట్టిపెట్టుము. నీవు పోవుటకుఁ గోరికి తీర్చుటకు - అది యెవ్వతె? నేను గాదా నీ భార్యను. రమ్ము నా వద్దకు రమ్ము. అని మంత్రమహిమ యావేశించి ఒడలు గగుర్పొడవఁగా సంక్షుభిత హృదయముతో లోని కాతనిఁ దీసికొనిపోయెను.

నాఁడు మొదలు ఆ వైశ్యకుమారుఁడు అందఱ కంద రాని ఆ దివ్యఫలములను గడుపాఱ భుజించుచు అదృష్టవంతు లలో అగ్రగణ్యుఁడై అఖిలభోగము లనుభవించెను. మంత్ర మహిమకుఁ గట్టువడిన యా దివ్యాంగనయు దివ్యస్థితిని విడ నాడి మానవమాత్రున కగ్గమై ఆతనితోఁ గాపురము చేసెను.

వింటిరా! ఇట్టులే లోకములో యాగములు దానములు మున్నగు సత్కర్మములు చేయువారి యింట దివ్యాంగనలు అప్పుడప్పు డవతరించుచుందురు. దివ్యపదవిలో నుండు వారిని సైతము - ఏదో దుష్కృతము ఒకానొకప్పుడు అధోగతిపాలు చేయుట చూచుచుందుముగదా! మీరిద్దరు కడచిన జన్మములో అక్కసెల్లెండ్రే అయి యుందురు. కావుననే దేహములు వేరైనను హృదయము లొక్కటియై అఱమఱలు లేక హాయి నిచ్చుచున్నవి.

ఈ మాటలు వసంతకుని నోట వాసవదత్తా పద్మావతులు చక్కఁగా విని ఒకరి కొకరు లేశమైనను ఈసు లేక మనసు కలసిపోయిరి. అప్పుడు పద్మావతి పంపిన దూత మగధరాజుసన్నిధి కరిగి వాసవదత్తామహానుభావత్వ మెఱింగింప - ఆ ఱేఁడుసైత మా నాఁటినుండి వత్సరాజునెడ తా నూహించినది తప్పే యని నిశ్చయించుకొని కూఁతు విషయమై నిర్విచారబుద్ధితో మెలఁగుచుండెను.

## ౮

## కౌశాంబీ ప్రయాణము

ఒకనాఁడు మహామాత్యుఁడు యౌగంధరాయణుఁడు దేవేరియు నితరులు సన్నిధినుండఁగా వత్సరాజున కిట్లని విన్నవించెను:— దేవా! మనము కౌశాంబి కేల పోవరాదు? జైత్రయాత్రాప్రయత్నము సేయవలదా! మనము మోసగించితి మని మగధరాజు మిత్తైక్కి యెత్తివచ్చునా! రాఁడు

రాఁడు. కన్యాసంబంధ మను గట్టి త్రాటిచే నాతనిని గట్టి వేసి యుంచితిమి. ఏమని మనతోఁ బోరాడును? పోరాడి ప్రాణమువంటి బిడ్డను వదలుకొనునా? తాను జేసిన ప్రమాణము కాదని అడ్డముతిరుగునా? రాజా! నీవు కాదు— ఆతనిని మోసము చేసినది. సర్వము నేనే స్వయముగఁ జేసితిని. ఈ చేఁతలవలన ఆతనికిఁ జెఱుపేమియు లేదు. పైఁగా నాతనికి మనమీఁద నలుక లేదనియే చారులవలనఁ దెలియవచ్చినది. అందులకే యిన్నాళ్ళు ఇక్కడ నున్నారము. ఈ ప్రస్తావము సాగుచుండఁగా మగధరాజువద్దనుండి దూత యొకఁడు వచ్చి ప్రణతుఁడై రాజానుమతిని గూరుచుండి యిట్లు మనవిచేసికొనెను:—స్వామీ! పద్మావతీదేవి పంపిన సందేశమునకుఁ బరమానందమంది మగధేశ్వరుఁ డీ మాటలు తెలుపుమని నన్నుఁ దమసన్నిధికిఁ బంపినాఁడు. ఇన్నిమాట లేల! అంతయుఁ దెలిసినది. నిన్ను మెచ్చుకొన్నాను. ఏది కడుపులోఁ బెట్టుకొని ఈ యుద్యమము సాగించితివో దానికయి నడుము కట్టుము. మేము నీకు వశ్యులమని వేఱె చెప్పవలెనా!

దూత పలికిన యీ మాటకు వత్సరాజు సంతోషము పట్టలేక యౌగంధరాయణుని నీతి వైశద్యమును మిక్కిలిగా అభినందించెను. అప్పుడు వాసవదత్తచే పద్మావతిని బిలిపించి ఆమెయుఁ దానును దూతను సత్కరించి బహూకృతులొసంగి సంతోషముగఁ బంపెను. అంతలో చండమహాసేనుని దూతయు వచ్చి తేనికి మ్రొక్కి తన దేవరపంపిన సందేశమిట్లని వినిపించెను: రాజా! నీ వృత్తాంత మెఱింగి చాలఁగా

హర్షించితిమి. వెయ్యేల! నీకు యౌగంధరాయణుఁడు మంత్రి యగుటలోనే గొప్పవిశేష మున్నది. నీ పున్నెములు పండినవి. నీయెడ భక్తిని జూపు వాసవదత్తయు కృతార్థురాలె. ఆమె యొనర్చిన మంచిపనిచే నందఱిలోఁ దలయెత్తుకొని తిరుగ నేర్చితిమి. మఱియు నాకు పద్మావతి యొక తెయు వాసవదత్త యొక తెయుఁ గాదు. ఆ యిర్వురి హృదయము లొక్కటియె యని వింటిమి. కావున నిర్విచారముగ నీవు విజయోద్యమమునకు వెడలవలె నని మా కోరిక.

మామ పంపిన యీ వార్తకుఁ గడుపునిండి దానికిఁ బ్రతిఫలముగా వత్సరాజు వాసవదత్తమీఁద ప్రణయాధిక్యమును మంత్రిసత్తమునియెడల ననురాగోత్కర్షమును మిక్కిలిగాఁ గ్రుమ్మరించెను. దేవేరు లిద్దఱు నమయోచిత సత్కారము లొనర్చి ఆ దూతను బహుమానించి పంపిరి. వత్సరాజు దిగ్విజయోద్యమము సాగింపఁ గుతూహలపడి సర్వ పరివారముతో కౌశాంబికిఁ దరలిపోయెను.

అకాలముగ పొంగిపొరలి నింగి కంటిన మహానీరధులు వోలె మహాఘోషతో సర్వసైన్యములు వెంటనంటి వచ్చుచుండ నేనుంగు నెక్కి వత్సరాజు పయనము సేయుచుండెను. ఉదయాచల మధిష్ఠించి వెలుంగు నా వేవెలుంగు మాత్రమే ఆతని కీడుజోడు కాఁగలఁడు. కోటిసూర్యప్రభాభాసమానుండగు వత్సరాజునకుఁ బట్టిన శ్వేతచ్ఛత్రము తుహినాంశుఁడో యన విరాజిల్లుచుండెను. గ్రహగణంబు లెల్ల ధ్రువుని బళివేష్టించినట్టులు సామంతభూకాంతు లాతని చుట్టును జేరి వచ్చుచుండిరి. వెనుక వరుసలోఁబడి యేనుంగు

నెక్కి దేవేరు లిర్వురు శ్రీభూదేవతలు వోలె విరాజిల్లు చుండిరి. వందిగణము కైవార మొనర్చుచుండ మహాదర్ప మున వత్సరాజు కతిపయ ప్రయాణములలో మహోత్సవ మండితంబైన కౌశాంబికి వచ్చెను. దేవేరు లిర్వురతో మహారాజు పురప్రవేశ మొనర్చుచుండ వారి దర్శనభాగ్యము నకు నడచివచ్చు పౌరాంగనాగణమునకు నాఁడు దివ్యమైన మహోత్సవమే ఆయెను.

ఆకసము నంటి వెలుంగు మేడలలో విరాజమాన సుందరీశతములు రాకాశశాంకుని సేనలువోలె మూఁగి రాజ దంపతులను జూచుచు కన్నులపండువు చేసికొనుచుండెను. కొందఱు సుందరాంగనలు రాజును దేవేరులను ఱెప్పవాల్పక చూచుచు అచ్చరల వోలెఁ జూపఱకు ముచ్చటగొలుపు చుండిరి. కొందఱు రమణీమణులు గవాక్షభాగములలోఁ గన్నులు వెట్టుకొని గాంచుచు మన్మథుని బాణ పంజరములు సృజించి యిచ్చుచుండిరి. ఒక్క మత్తకాశిని యా దంపతు లను జూడ నుత్తలంబంది తటాలునఁ బరువులు త్రోలి ముత్యాలసరములు పెరిఁగి రాలుటయు గుఱుతింపదాయె. అవురా! యిదేమే చెలీ! వీరిని జూడఁగా – ఆ నాటి దాహ ప్రవాదము జ్ఞప్తికి వచ్చి గుండె బ్రద్దలు చేయుచున్నదని యొకతె వేఱొకతెతో నుడివెను. బళిబళీ! దేవేరి సపత్నియు ననుకూలవతియే దక్కుట వింతలలో వింతయని తన్వి యొక్కర్తుక ముచ్చటించెను. నిజముగా శివకేశవు లీ యిరు వురి రూపురేఖలు పరికించియే యుందురేని గౌరీ లక్ష్ములను జేపట్టి యుందురా! అని యిందువదనలు కొందఱు విస్మయం బడఁ జొచ్చిరి.

ఇట్లీఱంగున వత్సరాజు దేవీసమేతుఁడై యందఱి కన్నుల కానందము గూర్చుచు శుభలగ్నములో కృతసన్నాహుఁడై తన నగరు చొచ్చెను. మనోజ్ఞమగు వీరి రాకచే రాజమందిర మెల్లఁ గళకళలాడుచుఁ గళాకాంతు లీనసాగెను. క్షణములో సామంత భూకాంతుల మంగళోపహారములచే రాజభవన మంతయు దండిగ నిండిపోయెను. రాజలోకము నెల్ల వత్సరాజు లెస్సగ సమ్మానించి యుత్తఱి మహోత్సవము కావించి దేవేరుల నడుమ రతీవల్లభుఁడు వోలె విరాజమానుఁడై కాలము గడపుచుండెను.

## నిధి లాభము

ఒకనాఁడు వత్సరాజు మంత్రులతో సామంతులతో హితులతోఁ బురోహితులతోఁ గొలువు తీర్చియుండెను. అప్పుడు బ్రాహ్మణుం డొకఁ డయ్యో! రాజా! రక్షింపవా, రక్షింపవా! యని వాకిట వచ్చి నిలిచి మొఱపెట్టుకొనెను. దాని విని ఱేఁడు లోని కాతని రావించి వానిగోడు విచారింప నాతఁ డిట్లు మొత్తుకొనెను:—ప్రభూ! అడవిలో పాపాత్ములు గోపాలకులు అన్యాయ్యముగా నా బిడ్డ పాదమును నఱికివైచిరి. నా విని ఱేఁడు తత్క్షణమె యా గోపాలకుల కొందఱిని రావించి వృత్తాంత మడిగెను. వారును గొలువులో ఱేని మ్రోల నిట్లని విన్నవించిరి:—దేవరా! సావధానముగ మా విన్నపము చిత్తగింపుఁడు. నిచ్చలు మేము పసులను గాచుకొనుచు నిర్జన ప్రదేశములో నాటలాడుకొనుచుందుము. మాలో దేవసేనుఁడని యొక గొల్లఁడున్నాఁడు.

మా ఆటలలో నాతఁడు మాకు ప్రభువు. ఆతఁ డొక్క-యెడ రాతిమీఁదఁ గూరుచుండి ప్రజలనుగా మమ్మేలుచుండును. మాలో నెవ్వఁడుగాని వాని యాజ్ఞ లవలేశము మీఱఁడు. ఈ ప్రకార మాతఁ డరణ్యములో రాజ్యము సేయుచుండఁగా నేఁ డీ బాపనకొడుకు-ఆ త్రోవనే పోవుచు-ఆ గొల్లదొరకు మొక్క-ఁడయ్యెను. దొరకు మ్రొక్క-క పోరాదని యెంతో చెప్పి చూచితిమి. మాట వినఁడే; అప్పాటను వాఁడట్లే నవ్వుచుఁ బోయెను. అంతట మా యేలిక ఆ పడుచువానికి పాదచ్ఛేదము దండనముగా విధించెను. మహాప్రభూ! మేము పరుగుపరుగునఁ బోయి రాజాజ్ఞగా ఆతని కాలు నఱికితిమి. రాజాజ్ఞను మీఱుట మహా పాతకము కాదా ప్రభూ!

ఈ ఘట్టము వినుచున్న యౌగంధరాయణుఁడు ప్రతిభావంతుఁడు కావున నేవియో మనస్సులో నూహలుపోయి వత్సరాజుతో నొంటిగా - రాజా! ఆ ప్రదేశములో నిశ్చయముగా ఒకనిధి యున్నది. దాని మహిమచేతనే ఆ గొల్లని కట్టిదర్ప మేర్పడి యుండును. మన మక్క-డికిఁ దప్పక పోవలె నని గట్టిగాఁ బలికెను. రాజును వల్లెయని గోపాలకులు దారిచూపఁగా సముచిత పరివారముతో - ఆ యడవికిఁ బోయెను. అచ్చట నేర్పరులు పరీక్షించి నిర్ణయింపఁగా బనివాండ్రు నేలను ద్రవ్వసాగిరి. అంతలోఁ గ్రిందనుండి పర్వతాకారుఁడు యక్షుఁ డొకఁడు వెడలి ఓహో! రాజా! ఈ నిధానము పాఁతిపెట్టినది మీ తాత. నేను జిరకాలము నుండియు దీనికిఁ గావలి కాచుచున్నాఁడను. ఇఁక నీవు పుచ్చు

కోవచ్చు నని చెప్పి ఆతఁ డొనర్చు పూజలు గైకొని మాయ మాయెను. అప్పు డాభూమిలోనుండి గొప్ప నిధానము-ఆవిర్భ వించెను. అమూల్యమైన రత్నసింహాసన మందులోఁ గాన వచ్చెను. వచ్చునపుడు - అభ్యుదయపరంపర యిట్టిదే వచ్చు చుండును. అత్తఱి వత్సరాజు మహోత్సవము కావించి పూజా పురస్కారములు ముగిసిన పిదప నిధానాదికంబును గైకొని గోపాలకులను గొనియాడుచుఁ దన నగరమునకుఁ బోయెను.

ఇట్టులు వత్సరాజు నిజదివ్య యశోవితానము నలు దెసలు పర్వ నిధానము భద్రపఱిచి ముక్తాఫల విరాజితంబగు బంగారు సింహాసన మొక్కచో నేర్పఱిచి యుంచెను. మఱు నాఁడు మహామంత్రి మహారాజా! కులక్రమాగతంబైన మహా సింహాసనము నీకు లభించెను. దీనిని దేవర వా రధిష్ఠించి మా కానంద మొనఁగూర్ప మిక్కిలిగా వేఁడుచున్నార మని పలికెను. రాజది విని యోహో! అదికాదు; మా పూర్వులు మున్ను లోకము నంతయు జయించి ఈ సింహాసన మెక్కిరి. నే నాపని చేయవలదా? చేయకయే దీని నెక్కి కూరు చున్న లోకము నవ్వదా? పదువురిలో బరువు దక్కునా? నేల నాలుగు చెఱంగులు జైత్రయాత్రలో జయించి నా యీ పెద్దల రత్నసింహాసన మధిష్ఠించెద నని బదులు పలికి - ఆ యుద్యమములో బద్ధశ్రద్ధ చూపెను. తేని యభిమానమును యౌగంధరాయణుఁడు మెచ్చుకొని దేవా! మంచిది. మొదట తూర్పుదెసవంకకే జైత్రయాత్ర సాగింపుమని వచిం చెను. ప్రస్తావ వశముగా రాజు తూర్పుదెసకే ప్రాముఖ్య మేల యని సందేహపడి యడిగెను. అందులకు మంత్రి

త్తముఁ డిట్లని వచించెను — దేవా! ఉత్తరము కౌబేర
గుట యుత్తమమేగాని మ్లేచ్ఛసంసర్గమునఁ జేసి దోషజుష్ట
యినది. పడమర సైతము సూర్యాదుల-అస్తమయ హేతువగు
చే ప్రశస్తము కానేరదు. యమధర్మరాజునకు నెలవై రాక్షసా
క్రాంతము కావుటను దక్షిణము కూడ తగినది కాదు. సూర్య
గవానులు తూర్పుదిక్కున ఉదయింతురు. మహేంద్రుఁడు
ూర్పు మాగాణము నేలుచుండును. గంగాభవాని తూర్పు
నకే ప్రవహించును. ఇన్ని హేతువులఁబట్టి తూరుపు
ర్వథా ప్రశస్తమై వెలయుచున్నది. కావున కల్యాణ
ంక్షులగు మహీపతు లెల్లరు ముమ్మొదట తూర్పునకే
ేతురు. నీ పెద్దలు సైత మీవిధానమే సమ్మతించి సర్వ
క్కులను జయించినారు. సామ్రాజ్యము పౌరుషాధీనమని
ద్ద లందురు. అందులకే శతానీకుఁడు కౌశాంబిని రమ్యమైన
ెంచి అందే వసించి యుండెను. నా విని ఉదయనుఁడు
ుమకారమునకే ప్రాముఖ్యమిచ్చి యిట్లని పలికెను.
ామంత్రీ! నిజము నిజము. సామ్రాజ్యమునకు దేశము
రణము కానే కాదు. సత్త్వవంతునకు సామ్రాజ్యము
పాధీనమగుట ముమ్మాటికి నిక్కము. ఒంటరిగాఁ
ూ్య - ఆశ్రయహీనుఁ డయ్యు - సత్త్వవంతుఁడు తప్పక
ంపదలు వొందును.

ఆ మాటకు దేవేరు లిర్వురు మంత్రులును సంతసించి
నందించిరి. పదపడి యౌగంధరాయణుఁడు రాజా! నీకు
న దైవానుకూల్యమూ కలదు. పౌరుషమూ చెప్పఁబని
మంత్రులమూ మేమును గొంత నీతిశాస్త్రము నేర్చి

తిమి. కావున నింకనైన ననుకొన్న తీరుగ దిగ్విజయము చేయుమని పలికెను. ఱేఁడును దానికి నల్లెయని వెండియు నిట్లనియె - లోకములో "శ్రేయాంసి బహు విఘ్నాని" యన్నది యున్నదిగదా! అంతరాయ శాంతికై పరమేశ్వరుని గూర్చి తపంబు సల్పెదను. శివప్రసాదము లేక మనోరథము లీడేరవు. దానికి మంత్రులు ప్రీతులయి శ్రీరాముని సేతుబంధ ప్రయత్నములో వానరపుంగవులట్లు తపఃప్రయత్నమునకు సమ్మతించిరి. ఆవల దేవేరులు మంత్రులు తపశ్చరణమున - అనుయాయులు కాఁగా వత్సరాజు మూన్నాళ్ళ నిట్రుపాస ముండెను. ఒక రేయి మహాదేవుఁడు కలలోఁ గానుపించి ఓయీ! నీ యుద్యమమును మెచ్చుకొంటిని. నిరంతరాయముగ నీవు జయంబు బొందెదవు. లెమ్ము. సత్వరముగ నీకు సకల విద్యాధర సార్వభౌముం డగు [illegible]పుత్త్రుఁడు కలుగు నని సంతోషవార్త పలికెను. మఱునా[illegible]కని వత్సరాజు మంత్రులకును వ్రతోపవాసక్లాంతల[illegible]కాంతలకును - ఆ కల వినిపించి కర్ణరసాయనము కావించెను. ఆ తీరుగ నా ఱేఁడు వ్రతాదికముచే మహామహిమను గడించెను. దేవేరులు మహాపతివ్రతలని పేరు ప్రతిష్ఠలు వడసిరి.

మఱునాఁడు మహోత్సవములో పౌరులెల్లరు తలమునక్కలై ప్రవర్తింప వత్సరాజు పారణ చేసి హాయిమెయిఁ గూరుచుండెను. అప్పుడు మహామంత్రి ఆతనితో నిట్లని పలికెను — దేవా! సర్వథా నీవు ధన్యుఁడవు. పరమేశ్వరుని యనుగ్రహము చక్కఁగాఁ బడసితివి. సర్వభూకాంతులను జయించి నిజభుజార్జిత మైన లక్ష్మిని గేలఁ బట్టుము. స్వధర్మ

సత్తముఁ డిట్లని వచించెను — దేవా! ఉత్తరము కౌబేర మగుట యుత్తమమేగాని మ్లేచ్ఛసంసర్గమునఁ జేసి దోషజుష్ట మైనది. పడమర సైతము సూర్యాదుల-అస్తమయ హేతువగు టచే ప్రశస్తము కానేరదు. యమధర్మరాజునకు నెలవై రాక్షసా క్రాంతము కావుటను దక్షిణము కూడ తగినది కాదు. సూర్య భగవానులు తూర్పుదిక్కున ఉదయింతురు. మహేంద్రుఁడు తూర్పు మార్గాణము నేలుచుండును. గంగాభవాని తూర్పు దెసకే ప్రవహించును. ఇన్ని హేతువులఁబట్టి తూరుపు సర్వథా ప్రశస్తమై వెలయుచున్నది. కావున కల్యాణ కాంక్షులగు మహీపతు లెల్లరు ముమ్మొదట తూర్పునకే నడతురు. నీ పెద్దలు సైత మీ విధానమే సమ్మతించి సర్వ దిక్కులను జయించినారు. సామ్రాజ్యము పౌరుషాధీనమని పెద్ద లందురు. అందులకే శతానీకుఁడు కౌశాంబిని రమ్యమైన దని యెంచి అందే వసించి యుండెను. నా విని ఱేఁడును బురుషకారమునకే ప్రాముఖ్యమిచ్చి యిట్లని పలికెను. మహామంత్రీ! నిజము నిజము. సామ్రాజ్యమునకు దేశము కారణము కానే కాదు. సత్త్వవంతునకు సామ్రాజ్యము పౌరుషాధీనమగుట ముమ్మాటికి నిక్కము. ఒంటరిగాఁ డయ్యు - ఆశ్రయహీనుఁ డయ్యు - సత్త్వవంతుఁడు తప్పక సిరిసంపదలు వొందును.

ఆ మాటకు దేవేరు లిర్వురు మంత్రులును సంతసించి యభినందించిరి. పదపడి యౌగంధరాయణుఁడు రాజా! నీకు వలసిన దైవానుకూల్యమూ కలదు. పౌరుషమూ చెప్పఁబని లేదు. మంత్రులమూ మేమును గొంత నీతిశాస్త్రము నేర్చి

తెమి. కావున నీ(క నైన ననుకొన్న తీరుగ దిగ్విజయము చేయుమని పలికెను. ఱేఁడును దానికి వల్లె యని వెండియు నిట్లనియె - లోకములో "శ్రేయాంసి బహు విఘ్నాని" యన్నది యున్నదిగదా! అంతరాయ శాంతికై పరమేశ్వరుని గూర్చి తపంబు సల్పెదను. శివప్రసాదము లేక మనోరథము లీడేరవు. దానికి మంత్రులు ప్రీతులయి శ్రీరాముని సేతుబంధ ప్రయత్నములో వానరపుంగవులట్లు తపఃప్రయత్నమునకు సమ్మతించిరి. ఆవల దేవేరులు మంత్రులు తపశ్చరణమున - అనుయాయులు కాఁగా వత్సరాజు మూన్నాళ్ళు నిట్రుపాస ముండెను. ఒక రేయి మహాదేవుఁడు కలలోఁ గానుపించి ఓయీ! నీ యుద్యమమును మెచ్చుకొంటిని. నిరంతరాయముగ నీవు జయంబు వొందెదవు. లెమ్ము. సత్వరముగ నీకు సకల విద్యాధర సార్వభౌముం డగు సత్పుత్రుఁడు కలుగు నని సంతోషవార్త పలికెను. మఱువాత మేలుకని వత్సరాజు మంత్రులకును వ్రతోపవాసక్లాంతలగు నిజకాంతలకును - ఆ కల వినిపించి కర్ణరసాయనము కావించెను. ఆ తీరుగ నా ఱేఁడు వ్రతాదికముచే మహామహిమను గడించెను. దేవేరులు మహాపతివ్రతలని పేరు ప్రతిష్ఠలు పడసిరి.

మఱునాఁడు మహోత్సవములో పౌరులెల్లరు తలము న్కలై ప్రవర్తింప వత్సరాజు పారణ చేసి హాయిమెయిఁ గూరుచుండెను. అప్పుడు మహామంత్రి ఆతనితో నిట్లని పలికెను — దేవా! సర్వథా నీవు ధన్యుఁడవు. పరమేశ్వరుని యనుగ్రహము చక్కఁగాఁ బడసితివి. సర్వభూకాంతులను జయించి నిజభుజార్జిత మైన లక్ష్మిని గేలఁ బట్టుము. స్వధర్మ

ముచే స్వీకరించిన లక్ష్మి సుస్థిరమై సౌఖ్యమిచ్చును. ధర్మార్జితములైన సంపదలకు నాశనము లేదు. నీ పెద్దలు గడించిన నిధానము చిరకాలము భూమిలోఁ బూడి నష్టమయ్యు నీకు దక్కినది. న్యాయార్జితమైన సంపద సంతతి యున్నంతదాఁక దాఁటిపోవదు. తక్కిన సిరి యెన్నఁడేని నీళ్ళ బుంపురులు వోలె క్షణభంగురమై రూపు మాయును. కావునఁ బురుషుఁడగువాఁడు ధర్మము చేతనే ధనము కూడఁ బెట్టవలెను. ఇఁక వేనిమాట వేఱె చెప్పవలెనా! సామ్రాజ్య వృక్షమునకు ధనమే మూలము. కార్యసిద్ధి కావుటకై మంత్రివర్గమునకు మన్ననలిచ్చి ధర్మోత్తరమైన సంపద గడింపను జైత్రయాత్రకు గడంగుము. కొండవంటి నీ యిరువురు మామల అండచేఁ బెక్కండ్రు రాజులు పోరుమాట యెత్తకయే పొందికగా నీతోఁ జేయి కలిపెదరు. కాశీరాజగు బ్రహ్మదత్తుఁడు మాత్రము బద్ధదీక్షగా నీవు చూడఁదగిన దొడ్డ శత్రువు. మునుముం దాతని బీఁచ మణఁచుము. ఆతఁడు – ఓడెనా తూర్పు మొదలు సర్వదిశలు నీకు తృణప్రాయమే యగును. అప్పటి నీ కీర్తి కాంత వైభవ మిట్టిదని చెప్పవలెనా!

## జైత్రయాత్ర

ఆ మాటలు విని వత్సరాజు సుముహూర్తము నిర్ణయింపించి దిగ్విజయోద్యుక్తుఁడై ప్రకృతులను బ్రయాణము కండని ఆజ్ఞాపించెను. తన్నుఁ జేరి వచ్చుచున్న బావమఱఁదికి గోపాలకునికి వైదేహరాజ్య మొసంగి ఆతనిని లెస్సగ సమ్మా

వించెను. దండును గొని తన వెంట వచ్చుచున్న పద్మావతి సోదరుఁడు సింహవర్మకు చేదిదేశ మిచ్చి సత్కరించెను. చిరకాల మిత్రమైన భిల్లరాజును పుళిందకుని గూడఁ బిలి పించుకొని ప్రయాణమునకు సిద్ధమాయె. అతని ప్రయాణ సంరంభము శత్రుభూపతుల గుండెలలో వ్యాకులత్వమును గూర్చెను.

ముందుగ యౌగంధరాయణుఁడు వారణాసికి చారు లను బంపి బ్రహ్మదత్తుని జాడలు కనిపెట్ట సాగెను. ఒక్క నాఁడు సుముహూర్తమున శుభశకునము కాఁగా వత్సరాజు సేనాపరివృతుఁడై బ్రహ్మదత్తుని మీఁదికి దండెత్తిపోయెను. నడగొండల వంటి యేనుంగులపిండును వేవెలుంగు వాహన ముల నీసడించు వారువంబుల బంతులును విజయధ్వాన మొనర్చు వీరవరుల మహార్భటియు వత్సరాజు విజయ యాత్రకు సూచిక కాఁగా సేనాపరాగము – ఆకసము నంటి సూర్యుని గ్రమ్మివైచెను. దేవేరు లిర్వురు కీర్తి లక్ష్ములు వోలె జేనిని – అనుగమించుచుండిరి.

ఇంతలో యౌగంధరాయణుని చారులు కాపాలిక వేషము దాలిచి వారాణసికిఁ బోయిరి. వారిలో మోసముల నారితేఱిన మానిసి యొకఁడు మహాజ్ఞానివోలె నటనసేయుచు గురువుల వేషము దాల్చెను. కొందఱు వానికి శిష్యులై కథ నడపింపఁ దొడంగిరి. శిష్యులు గురువునుగూర్చి త్రికాలవేది యని వాడవాడల ప్రచారము సేయుచు ప్రశంసింపఁ జొచ్చిరి. భిక్షాశియైన ఆ మాయాగురువును జోస్యము సెప్పుఁ డని లోకులు కాకులువోలెఁ జుట్టును మూఁగసాగిరి. కొంపలు

కాలుట, గొడ్డు గోదలు పాఱిపోవుట మున్నగు భవిష్యద్వృత్తాంతములను – ఆ పరమయోగి అడిగిన వారికిఁ జెప్పుచుండ ఆ రహస్యమును గుఱించి శిష్యవర్గ మా ప్రకారమే యేకాంతమున నెరవేర్చుచుండిరి. ఊరిలో – ఆ గురువుల వారి పేరు పెంపులు పెరుఁగఁజొచ్చెను. క్రమముగ నాతఁడు రాజప్రియుఁడైన ఒక రాజకుమారునికి సుప్రసిద్ధు లొనర్చి మనసునకెక్కఁ బ్రవర్తించి వానిని దన చేతిలోఁ బెట్టుకొనెను. ఆ రాజకుమారుఁడు బ్రహ్మదత్తుని ముందు గురువులవారి జోస్యము మహిమ నోరూర వర్ణింపఁ దొడఁగెను. ఒకనాఁడు బ్రహ్మదత్తుఁడు మాయాగురువులను బిలిపించుకొని వత్సరాజు దండయాత్రనుగూర్చి మనసువోయి యెన్నో ప్రశ్నలు వైచెను. వాఁడును సమయోచితధోరణిఁ జూపి యుద్ధ రహస్యములు కనుగొనుచుండెను.

బ్రహ్మదత్త మహారాజునకు యోగకరండకుఁడను మంత్రి కలఁడు. ఆతఁడు ఎత్తివచ్చు వత్సభూపాలుని మోస గింపను దారిలోఁ బెక్కుమాయలు పన్ని పొంచియుండెను. చెట్టులు పుట్టలు, ఱాలు రప్పలు, నీరు నిప్పులు, తోఁటలు దొడ్డులు, తీఁగలు డొంకలు, గడ్డి గాదము, అన్నియు బ్రాణా పాయకరముగాఁ జేసివైచెను. వత్సరాజు రాణువలో విష కన్యలను బ్రవేశపెట్టెను. రాత్రివేళ ఉపాయములు పన్ని చంపు టకు పురుషులను సైతము గూఢముగాఁ బంపెను. అన్నియు మాయాగురువు గుఱించి యెప్పటి కప్పుడు యౌగంధ రాయణునకుఁ జెప్పి పంపును. వాఁడును జక్కఁగా నెఱింగి త్రోవలో దూషితములైన సర్వవస్తువులను బ్రతియోగముచేఁ

బరిశోధించును. రాణువలోనికి పరభామినులను రానీయవల దని ఆన వెట్టును. ఆతఁడును రమణ్వాంతుఁడును నెదకి వెదకి నూతన పురుషులను పట్టి కొట్టి హతమార్తుర. ఈ ప్రతీ కారము లెల్లను బ్రహ్మదత్తుఁ డెఱింగి ఆశలుడిగి ఎత్తివచ్చు నా వత్సేశ్వరుని జయింప నయితి గాక మంత్రాలోచనము కావించియు లాభము లేదని యెంచియు దూతు నొకని నాతని సన్నిధికిఁ బంపెను. అవలఁ దానే సపరివారుఁడయి ఎదురు వోయి వత్సరాజునకు ప్రణతుఁడాయె. అట్టివానిని వారాణసీపతిని వత్సరాజు – అప్పుడు మిక్కిలిగా సమ్మా నించెను.

ఇమ్మెయి నా భూకాంతుఁడు – ఆ కాశీరాజును జయించి దండును గదల్చి భూరుహములను మహావాయువు వోలె మహీపతులను బెక్కురను వంచుచు పెళుచు బుద్ధులను బెకలించుచు స్వైరవిహార ధీరుఁడయి పోయిపోయి తూర్పు కడలి యొడ్డున జయస్తంభము నెలకొల్పెను. కాళింగులు గడగడలాడి ఎదురువోయి కరపుటములు మోడ్చి వినయము సూపి కప్పములు కట్టిరి. ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ నరుదేఱ వీరాధిపీరులు బరాబరులు సేయ అడవు లను గాలించి దండుతోఁ గదలి దక్షిణదిశకుఁ దిరిగెను. అచ్చట కావేరిని దాఁటి చోళరాజు కీరితి మంటఁగలిపి మురళ దేశీయుల ప్రాభవము కొంచెపఱిచి దిగ్విజయమును జాటెను.

పదపడి వత్సరాజు రేవానదిని దాఁటి ఉజ్జయినికిఁ బోయెను. అప్పు డాతనికి చండమహాసేనుఁ డెదురు వచ్చి

మిక్కిలి మన్నన లోసంగి యింటికిఁ దోడుకొనిపోయె. అయ్యెడ మామ చూపిన గౌరవమునకు అల్లుఁడు తనివి సెంది తాను మక్కువపడు స్వదేశభోగములను సైతము మఱచిపోయి అందే సుఖముండెను. వాసవదత్తయు తండ్రి నెడఁబాయక చిన్ననాఁటి చేఁతలు తలంపులో మెదలుచుండ మిక్కిలిగాఁ గులుకుచుండెను. వాసవదత్తాసమాగమముచే మహాసేనుఁడు తా నెంతగా సంతసించెనో అంతగా పద్మావతిని సైతము చూచుకొని మురిపము తీర్చుకొనెను. కతిపయ దినము లీతీరుగ వత్సరాజు ఉజ్జయినిలో కాలము పుచ్చి మహాసేనుని మహాసేన వెంట వచ్చుచుండ పడమటదిశలో దాడివెడలెను. సముద్రము త్రచ్చుటకై తన్ను మఱల నీతఁడు పెకల్చునేమో అన్న బీతున మందరపర్వత మాతని యుత్తుంగ మాతంగముల యుద్ధతికి గజగజలాడెను. ఆవల నా భూపతి కుబేరతిలకయు కైలాసహాస సుభగయునై పొలుపారు ఉత్తరదిశ వైపునకు మఱలెను. అయ్యెడ సింధురాజును లోఁగొని మ్లేచ్ఛులను బరిమార్చి పారశీకరాజు తల తీసి వైచెను. హూణులను - అణఁగఁ ద్రొక్కెను. కామరూపేశ్వరుఁడు ఛత్రశూన్యమైన శిరస్సుతో వచ్చిపడి పిడియేనుఁగులను వెక్కింటిని బహూకృతి నొనర్చి జోహారు సల్పెను.

ఈ విధముగ వత్సమహీపతి సర్వసైన్య సమువేతుఁడయి పద్మావతీ జనకుఁడగు మగధరాజు నగరమున కరిగెను. దేవేరు లిర్వురితో - అల్లుఁడు విచ్చేయుఁగా మగధరాజు నగరములో మహోత్సవము చాటఁ బంపెను. ఒకనాఁడు-

అజ్ఞాతవాసమునఁ దన యింటనే కాలచుగడిపి నేఁడు వ్యక్తముగాఁ దనయింటఁ గాలువెట్టిన వాసవదత్తాదేవిని మగధ రాజు ఎంతో కన్నులకద్దుకొని గారవించెను. మగధరాజు నగరములో పౌరులు వీరులు సర్వజనము వత్సరాజును అభినందింపను వచ్చిచూచి ముదమంది నేల ఈనినట్లు-ఇసుక వైచిన రాలని వడువున తండోపతండములుగ వెంటనంటి కొలుచుచు రాఁగా వత్సరాజు తుదికి లావాణము చేరెను. అచ్చట సర్వసేనయు విశ్రాంతి నొందుచుండ నొకనాఁడు వత్సరాజు - ఒంటిగా యౌగంధరాయణునితో నిట్లని వచించెను—సచివోత్తమా! నీ బుద్ధి మహిమచే సర్వధరాకాంతులు మనకు పాదాక్రాంతులైరి. వారిలో నెవ్వరును మఱల నెదురు తిఱుగువారు లేరు. ఒక్క కాశీరాజును మాత్రము-ఆదమఱచి యుండరాదు. ఆతని ప్రకృతి మంచిదికాదు. ఎప్పటి కెట్టు లౌనో! కనిపట్టి కనుగలిగి యుండవలెను. అది విని మహామంత్రి దేవా! ఆతఁడిఁక వికృతుఁడు కానేరఁడు. పరాక్రమముచూపి ఆతనిని గట్టిగఁ బట్టితిమిగాదా! నీవు వానిని గారవించితివికూడ. అతఁడిఁక మనజోలికి రానేరాఁడు. వచ్చెఁబో! నీ చేతిలో ఆతఁడు చచ్చుట నిశ్చయము. అని పలికిన దానికి వత్సరాజు సంతసించి లేచి కాల్యములు నిర్వర్తించెను. మఱునాఁడు సర్వదిగ్విజయ వైభవోపేతుఁడయి రాజధానియగు కౌశాంబికిఁ దరలిపోయెను.

పౌరసుందరీ బృందమునకు నేత్రపర్వము కావించుచు వందిమాగధులు కైవారములు సేయుచుండ సామంత భూకాంతులు జోతలు వెట్టుచుండ యోధాను యోధులు

బరాబరులు సలుపుచుండ వత్సరాజు నిజమందిరము చొచ్చి సకలరాజులకుఁ దన శాసనము చాటఁబంచి పూర్వార్జితమై నిధానాధిగతమైన సింహాసనమును జయపూర్వకముగా నధిష్ఠించెను. అత్తఱి మంగళతూర్యముల మ్రోతలు లోక పాలుర సాధువాదములో యన నెల్ల దిక్కులఁ బిక్కటిల్లెను. సర్వభూమండల సమార్జితంబైన నానావిధ ధనరాసులను అర్థిబృందమునకుఁ బంచిపెట్టి వీతలోభుఁడని పేరు వొందెను. పౌరవర్గము రాజమండలము మంత్రివర్యులు మహోత్సవములోఁ బాల్గొని ముచ్చట తీర్చుకొనిరి.

ఈ తీరుగ వత్సరాజు సర్వధరాతలము నిశ్శేషముగ జయించి సర్వధా కృతార్థుఁడై రాజ్యభారము యౌగంధ రాయణ రుమణ్వంతుల భుజస్కంధములలో మోపి దేవేరు లిర్వురతో హాయిగాఁ గాలము పుచ్చుచు నిచ్చలు సుఖ ముండెను.

కౌశాంబి నిజరాజధాని కాఁగా మహామంత్రులు రాజ్యభారము వహింప – చల్లని యేలుబడిలో పౌరులెల్లరు ఎల్లవేళల సౌఖ్యములు జుఱ్ఱుచుండ వసంతక సహాయుఁడగు ఉదయన మహారాజు విహారైకపరాయణుండై దేవేరులతో సంగీతకము సేయుచుండును. మధుపాన మహోత్సవములో మునిఁగి తేలును. ఒకప్పుడు వేఁటకయి వోయి అడవులలోఁ ద్రిమ్మరుచుఁ జీఁకటి మొత్తములవంటి వరాహబృందమును గూల్చును. ఆతని కోల్తలం గూలిన కాఱుఁబోతుల నెత్తుటం జొత్తిల్లి పుడమియెల్ల అడవితమ్మియో యన నలరారు చుండును. పంచాననములు పంచప్రాణములు పైకిఁ బోవ –

ఆవటిల్లి ఆతని మృగయాసారస్యమును వేనోళ్ళఁ జాటు చుండును.



## నారదాగమనము

కేవల సుఖమయ జీవియై వత్సరాజు కాలము గడపు చుండ - ఒకనాఁడు నారదమౌని ఆతనికి దర్శన మొసంగెను. వినయ వినమిత శిరస్కుఁడై సత్కరించిన యా ఱేనిని నారద మహర్షి ఆశీర్వదించి క్షణకాల ముండి యిటులు వచించెను:- రాజా! సంగ్రహించి ఒకమాట చెప్పెద; సావధానుఁడవై వినుము. మున్ను మీ పూర్వులలో నీకుఁబోలె పాండురాజున కిద్వరు భార్య లుండిరి. ఒకతె కుంతి; వేఱొకర్తుక మాద్రి. సాగరావృతమైన సర్వధరామండలమును పాండుభూపతి యేలుచు సుఖియై ఒకనాఁడు వేఁట తమకమున అడవికిఁ బోయి మృగరూపమున విహరించు మౌని దంపతులను గోలఁ గూలనేసెను. ఏటువడిన యా క్షణమె మౌని నిజాకృతి పూని కంఠగతప్రాణుఁడై నన్నుఁబోలె నీవును ఇట్టి సుఖమయ వేళలో జత్తువుగాక యని ఆ ఱేనికి శాప మిచ్చెను. నాఁటినుండి విషాదము నిండి; ఉండియుండి యా పాండువు ఒక్కనాఁడు శాపప్రేరితుఁడయి మాద్రిని గామించి అప్పుడే మరణించెను. రాజా! వేఁట మమకారము రాజుల కొక గొప్ప దోసము. ఆ దోసము దొరలి ఎందఱెందఱో హతులైరి. అది యెఱింగి నామాట విని నీవు ఆ వేఁట మానుము. నీవు కల్యాణ పాత్రుండవు. నాకు విశేషించి ప్రియుఁడవు. కామాంశమున

నీకు పుత్త్రుఁడు కలుగును. మున్ను రతీదేవి పతిభిక్షను గౌరి పరమేశ్వరుని బ్రార్థింప నాతఁడు బ్రీతుఁడయి పార్వతి భూలోకములోఁ బుట్టి నన్నే ఆరాధించి కాముని బుత్త్రినిగాఁ బడయునని ఆమెకు వరమిచ్చెను. ఆ మాటను బట్టియే గౌరి చండమహాసేనుని కడుపునఁ బుట్టి వాసవదత్తయను పేరట నీకు పట్టపురాణి ఆయెను. పరమేశ్వరారాధనమునఁ జేసి యీమె మన్మథుని సుతునిగాఁ బడయనున్నది. ఆతండు సర్వవిద్యాధరులకు సార్వభౌముఁడై పరఁగును.

ఈ వార్త చెప్పఁగా వత్సరాజు సంతసించి తన రాజ్య మంతయు నారదార్పణము కావించెను. ఆ మహర్షియు మెచ్చుకొని మఱల నాతనికే దాని నొసఁగి అంతర్ధాన మందెను.

నానాఁటికి సుతేచ్ఛ మిక్కుటము కాఁగా వత్సరాజు దేవేరులతోఁ గాలము పుచ్చుచుండెను. ఒక్కనాఁడు మంత్రులు హితులు పురోహితులు పరివేష్టించియుండ వత్స రాజు ఒడ్డోలగము తీర్చియుండెను. అత్తఱి బ్రతీహారుఁడు వచ్చి బ్రవర పలికి దేవా! దేవరవారి దర్శనార్థము బ్రాహ్మణి యొక్కర్తుక యిద్దరు బిడ్డలతో వాకిట నిలిచియున్నదని విన్నవించెను. సరే లోనికి రావింపుమని ఱేఁడు అనుజ్ఞ యిచ్చెను. ఒడలు నవసి ధూళిధూసరిత వదనయై శిథిలవస్త్రధారిణియై పేదఱికము తొంగిచూడ దైన్యావ తారములను బోలు బాలకులను జంకనెత్తుకొని బ్రాహ్మణి కొలువులోనికి వచ్చి కృతోచితప్రణామయై ఱేని కిట్లని విన్న వించెను:— మహారాజా! నేను బ్రాహ్మణిని. సత్కుల

ప్రసూతను. పట్టి పేదఱికము చుట్టుకొనఁగా నా కర్మము
కాలి నాకీ కవలు పిల్లలు సైతము కలిగినారు. నాకు అన్నము
కఱవగుటచే బిడ్డలకు పాలు లేవు. శరణాగత వత్సలుండవని
తెలిసి నీసన్నిధికి వచ్చితిని. పాల ముంతువో నీట ముంతువో-
ఆపయి నీ చిత్తము. దాని విని ఱేఁడు కనికరించి వాసవ
దత్తకు ఆమె నొప్పగింపుమని ప్రతీహారున కాజ్ఞ యిచ్చెను.
వాఁడును చిత్తమని ఆ పాఱుతను అప్పుడే వాసవదత్త
సమ్ముఖమునకుఁ దోడుకొనిపోయి రాజాజ్ఞను విన్నవించెను.
దేవియు - అది రాజాజ్ఞ కావున విశిష్టమగు శ్రద్ధనుజూపి
ఆపిల్లల తల్లిని జక్కఁగా నాదరించుచు నిట్లని భావించెను:—
ఔరా! ఏమి ఆ బ్రహ్మదేవుని కౌటిల్యము? ఒక వస్తువుపై
మత్సరమా! ఇంకొక వస్తువుపై మోహమా! ఏరి కోరి
యెన్నేండ్లనుండియో జపించుచు తపించుచున్న నాకు కడు
పున ఒక్క నలుసు వెలయరాదా? నిఱుపేద గేస్తురాలి
కీమెకు ఇర్వురా బిడ్డలు? అని యేమేమియో అనుకొనుచు
ఆమెకు స్నానాదికము జరిపించి మేలువలువలు కట్టనిచ్చి
మంచి యోగిర మిప్పించెను. ఆమెయు - అన్నియు సమ
కూరఁగా సమాశ్వసిల్లి వాసవదత్తాసన్నిధిని ప్రొద్దులు
పుచ్చుచు బిడ్డలఁ జూచుకొనుచు ఉబుసుపోకకు ఏవియో
కథాప్రసంగములలో దించుచు ముచ్చట పెట్టుచు దేవి
మనస్సును రంజింపజేయుచుండెను.

క్రమముగ నా వాసవదత్త ఆ బ్రాహ్మణి శీలమును
మాటలలోని ప్రౌఢిని మనసులోని ఔదార్యమును గలుపుఁ
గోలుఁ దనమును సభాప్రవేశ ప్రావీణ్యమును గుఱుతించి

మిక్కిలిగా మెచ్చుకొని ఒకనాఁ డామెతో నీభర్త ఎవరు? నీ కథ యేమి? చెప్పుమా! విందుమని ప్రస్తావ మెత్తెను. అంతట బ్రాహ్మణి ఆమెతో నిట్లని వినిపించెను:—

## పింగళిక

అమ్మా! మాళవదేశములో అగ్నిదత్తుఁడని బ్రాహ్మణుఁ డుండెను. ఆయనయిల్లు సిరిసంపదలకు పుట్టినిల్లు. ముఖము సరస్వతికిఁ గాణాచి. పైఁగా ఆయన దొడ్డ త్యాగి. ఆయన కిద్దరు కొడుకులు. శంకరదత్తుఁడు జ్యేష్ఠుఁడు, శాంతికరుఁడు కనిష్ఠుఁడు. ఈతఁడు చిన్ననాఁడే చదువులకోసమని హఠాత్తుగ ఎక్కడికో దేశాంతరము పట్టిపోయెను. ఆ పెద్ద ఆయన నా పెనిమిటి. నా తండ్రి పేరు యజ్ఞదత్తుఁడు. ఆయన గొప్ప సంపన్నుఁడు; నిష్ఠాగరిష్ఠుఁడు; యజ్ఞయాగాదులు చేసిన సంప్రదాయజ్ఞుఁడు.

కొన్నేండ్లు నాయింటిలో నేను గాపురము చేయఁగాఁ జేయఁగా పెద్ద వయసు వచ్చి మా మామగారు కాలము చేసిరి. సంప్రదాయము తెలిసిన మా యత్తగారు సహగమనము చేసిరి. అప్పటికి నేను గర్భిణిని. నాఁడు నా పెనిమిటి నన్ను విడనాడి తీర్థయాత్రా వ్యాజముతో పోయిపోయి సరస్వతీనదీ తీరమున శోకాంధుఁడై అసువులు పాసెను. ఎవ్వరో వారి అనుయాయులు వచ్చి ఈ దుర్వార్త నా చెవిని వేసిరి. ఛీ పాపిష్ఠిజన్మ మని రోసి సహగమనము సేయను సిద్ధమైతిని. గర్భిణివి తప్పు సుమా! అని చుట్టాలు నన్ను మందలించి ఆటంక పెట్టిరి. ఈ పుట్టెఁడు దుఃఖములో మేము

ఇట్టులు మునింగి యుండఁగా - ఒకనాఁడు మా యింటినేగాక అగ్రహారమెల్ల ఊచముట్టుగ దొంగలు దోఁచుకొనిరి. అప్పుడు ఇర్వురు ముగ్వురు బ్రాహ్మణాంగనలను వెంటవైచుకొని ఒంటిమీఁదివి ఏవో చినిఁగిన ఒండు రెండు గుడ్డలతో బిక్క మొగము వెట్టుకొని వలస వోయితిని. దేశభ్రష్టతకుఁ జిక్కి పడరానిపాట్లు పడి ఎంతో దవ్వు నడచి నడచి ఏదో రీతిని ఒక నెలపాటు బ్రదుకుఁదెరువు చూచుకొను దురవస్థలో మునిఁగితిని. ఇంతలో లోకులవలన ఉదయన మహారాజు అనాథరక్షకుఁ డని విన్నదాననై శీలమే దారిబత్తెముగాఁ బెట్టుకొని ఆ భాగ్యశాలినులతో ఈ ప్రాంతము వచ్చితిని. పాపము వారు సహాయులై కంటఁ గని పెట్టియుండఁగా వచ్చిన వెంటనే - ఈ కవలపిల్లలను గంటిని. దేవీ! నా క్షోభ మేమి చెప్పుదును? ఆపరాని శోకవేగ మొకవైపు. అంతులేని దారిద్ర్య మొక ప్రక్క... పైఁగా అనువుగాని లాఁతి విలాతి. ఆపదల దొంతర బ్రహ్మదేవుఁడు పేర్చి చచ్చిన చావుగా నాకిచ్చినాఁడు. ఇఁక నీ బిడ్డలను బెంచుటలో ఏదీగతి యని ఏడ్చి ఏడ్చి ఏదియుఁ దోఁచక స్త్రీభూషణమైన సిగ్గును సైతము విడనాడి కొలువులోనికి వచ్చి మహారాజు కంటఁ బడితిని. దిక్కుచూపుమని మొత్తుకొంటిని. ఆయన బుద్ధిమంతుఁడు కావుటఁబట్టి కనికరించెను. ఆయన ఆజ్ఞయే నన్ను నీపాద కమలముల సన్నిధికి తోడితెచ్చినది. అమ్మా! నా కష్టము లిప్పటికిఁ దీఱినవి. ఇదే నా విషాదాంతగాథ. నా పేరు పింగళిక. పుట్టినదొట్టి అగ్నిహోత్ర ధూమపరంపరచే నా కన్నులు పచ్చఁబాఱినందున ఈ పేరు నాకు నా పెద్దలు

పెట్టిరి. నామఱంది శాంతికరుఁడు ఏమయిపోయెనో! ఎక్కడ నున్నాఁడో ఇప్పటికిని అంతు పట్టదు.

ఆ వృత్తాంత మంతయు వాసవదత్త ఉత్సుకురాలై విని విని ఆమె కులీన యని తోఁచి ఏదో జ్ఞప్తికివచ్చి అమ్మా! మా పౌరోహితుఁడు శాంతికరుఁడని ఒకఁడున్నాఁడు. ఆయన నీ మఱందియేమో! విచారింతమా యని పలికి ఆ రేయి గడపెను. మఱునాఁడు శాంతికరుని బిలిపించి వంశక్రమమును విచారించెను. సరిగా వాఁడే వీఁడు. ఇదిగో! నీ వదినె యని ఆతనికి దేవి పింగళికను జూపెను. అతఁ డెట్లో - ఆనవాలు పట్టి బంధునాశనమునకు వగచి వగచి ఆమెను దన యింటికి గొంపోయెను. ఇంటి వార్తలు విన్నకొలఁది ఆతఁడు దుఃఖము పట్టలేకపోయెను. ఆమెకును గడుపు తఱుగుకొనిపోయె. వాసవదత్తయు అందఱ నోదార్చి కలుగఁబోవు తన కుమారు నకు పింగళిక బిడ్డల నిర్వురను పురోహితులనుగా నేర్పఱిచెను. వారిలో జ్యేష్ఠుఁడు శాంతిసోముఁడు. కనిష్ఠుఁడు వైశ్వానరుఁడు. రాజు వారికి బహూకృతి యొనర్చె. అంతయు దైవమాయ. ఆ బిడ్డలు తల్లియు శాంతికరుఁడు అందఱు - ఆనుషంగికముగఁ గలసికొని అందే ఐశ్వర్య వంతులై ఆనందాబ్ధిని నోలలాడరి.

ఒకనాఁడు దేవీమందిరమున కులాలకాంత ఒక్కర్తుక అయిదుగురు బిడ్డలతో ఏవో కుండలు పట్టుకొని వచ్చెను. ఆబిడను రాణి చూచి ఉస్సురని నిట్టూర్చి ప్రక్కనున్న పింగళికతో ఇదిగో! చూడుము చెలీ! ఈబిడ ఎంతటి అదృష్టవతియో! అయిదుగురు బిడ్డలను గన్నది. ఒక్కఁడు

నాకుఁ బుట్టఁగూడదా! దీనిమాత్రము నేను నోఁచుకోలేదా! అని పాపము చాల వగచెను. అప్పుడు పింగళిక అమ్మా! కాదు. అతిసంతానము దారిద్ర్యహేతువు. దరిద్రులకు దుఃఖముకోసమే పుట్టెదు పిల్లలు పుట్టెదరు. మీవంటి ఉత్తమ వ్యక్తులకు ఒక్కఁడైనను ఉత్తముఁడే కలుగును. తొందఱపడవలదు; చింతింపఁబోకు మని యూఱడించెను.

## శివప్రసాదము

దేవేరిమదిలో పాఁదుకొనియున్న ఈ విచారము వత్సరాజు ఎఱింగి ఒకనాఁ డామెతో దేవీ! పరమేశ్వరారాధనముచేఁ గుమారుఁడు కలుగునని నారదులవారు సెల విచ్చిరిగదా! కావున వరదుని-ఆ పరాత్పరుని అవశ్యమారాధింపు మనెను. ఆమెయు సంతసించి ఆ వ్రతములో ఉత్సుకత చూపెను. రాష్ట్రములో సంతటను శంకరారాధన వ్రతము నిరంతరముగా సాగెను. ఆ దంపతులు మూన్నాళ్ళు ఉపవసించిరి. దేవదేవుఁడు అనుగ్రహించి కలలో వారికిఁ గానుపించి వారు కోరిన వ్రతమును ప్రసాదించి అంతర్ధానమందెను. తఱువాత దంపతులు లేచి పట్టరాని సంతోషముతో బ్రకృతుల కందఱకు - ఆ మధురవార్త శ్రోత్రపేయము గావించి మహోత్సవము నడపి వ్రతపారణ చేసిరి. పదపడి కొన్నాళ్ళకు వాసవదత్తకు స్వప్నములో జటాధారి యగు మహాపురుషుఁడు పండొకటి చేతికిచ్చి పోయెను. ఆ కల విని ఱేఁడును అత్యంతము హర్షించెను. అమాత్యవర్యులు అభినందించిరి.

## గర్భదౌహృదము

అనుకొన్నట్టులె వాసవదత్తాగర్భము కామాంశావతారముచేఁ గమనీయమై వెలసె. పాలిపోయిన ఆమె మొగము రాకాసుధాంశునకు క్రించుఁదనము తెచ్చిపెట్టె. గర్భవాస మప్పుడే విద్యాధర చక్రవర్తిని సేవింప మనసుపడి రూపెత్తి వచ్చిన సర్వవిద్యలు వోలె ఆమె సఖులు నిరంతరము ఆమెను సేవింపఁ జొచ్చిరి. రుచుల పోంకము మాఱెను. వింతలగు కోరిక లీరికలెత్తెను. ప్రస్తావప్రాప్తములను మంత్రోపాసకుల కథలను నోరూర వినుచుండును. ఇలలోఁ గానరానివి ఎన్నో కలలోఁ గానవచ్చును. తాను - ఆకాశ సంచారిణియై యున్నట్లును - విద్యాధర కాంతలు తన్నుఁ బరివేష్టించి ఆటల పాటలలో సారస్యము చూపుచు సేవించుచున్నట్లును తాను కలగనును. మేలుకొనియు - ఆకసములో క్రీడింపనే మనసుపుట్టి దానికయి ఎదురు చూచును. ఆ దౌహృదము కనిపెట్టి మహారాజు సైతము మహామంత్రి బుద్ధికౌశల్యమున మంత్రములు తంత్రములు - ఇంద్రజాలములు మహేంద్రజాలములు - ఉపయోగించియు ప్రయోగించియు మదిలో నూఱట్ల గొలుపును. విద్యాధరుల ఉదార చరిత్రములు వినవలెనని చెవి కోసికొనును. జీమూతవాహనాదుల దివ్యచారిత్రములను మధుర మధుర వాక్యములలో యౌగంధరాయణుఁడు నిచ్చలు వినిపించుచుండును. ఆ కథలు మనసులో చొచ్చి వాసవదత్త దేవతానుగ్రహము అగ్గలముగాఁ గలది కావుటను ఊహించుకొనుచు నాథుని సన్నిధిని నోరార నుడువుచు దినములు గడుపుచుండెను.

## దే వీ స్వ ప్న ము

ఒకనాఁడు మంత్రివర్యులు మహారాజును ఒక్కచో నున్నతఱి వాసవదత్త దేవితో - ఇట్లని వచించెను:- ఆర్యపుత్రా! గర్భము దాల్చినది మొదలు తద్రక్షణ చింతయే నాకు బలమై తోఁచుచున్నది. అదే 'యావ'తో నిదురలో మునిఁగిన నాకు రాత్రి - కలలో ఒక దివ్యపూరుషుఁడు కానవచ్చెను. ఆయన ఒడలెల్ల విభూతిపూఁత. ౘౌదల చంద్రకళ. ఎఱ్ఱని జటాజూటము. చేతిలో త్రిశూలము. ఆ రూపువాఁడు కానవచ్చి కనికరించి యిట్లనియె - 'అమ్మా! ఈ నీ గర్భము విషయమై దిగులుపడఁబోకుము. రక్షింపను నేనున్నాను. నేనేగదా నీకు దీనిని బ్రసాదించితిని. ఈ మాట నమ్ముటకయి ఒక తార్కాణ చూపెదను. రేపు- ఒకానొక యువతి తన పతిమీఁద నేరము మోపి ఆతనిని బడబడ లాగుచు వచ్చి మీ మ్రోల అభియోగము పెట్టును. ఆబిడ మంచిదిగాదు. వట్టి దుశ్శీల. చుట్టాల ఆసరా చూచుకొని పెనిమిటిని జంపింపఁ దలఁచి ఆతనిమీఁద నిందలు మోపును. ఆబిడ చెప్పునవి అన్నియు అబద్ధములే. ఆ చెడిప నుండి నెమ్మదిగా ఆ సాధువును విడిపింపను ముందుగ నీవు నీ భర్తతోఁ జెప్పవలసియుండును.' అని ఆయన అంతర్ధానమందెను. అంతలో మేలుకొంటిని. బళ్లునఁ దెల్లవాఱె. ఈ కథ అందఱును విని ఆశ్చర్యపడి ఇది ఈశ్వరానుగ్రహమే అని నిర్ధరించి ఆ తార్కాణము కోసమై కన్నులు తెఱచుకొని యుండిరి.

అప్పుడే ద్వారపాలకుఁడు వచ్చి, అయ్యా! ఎవ్వతెయో గాని చుట్టపక్కములు చుట్టును జేర – అయిదుగురు బిడ్డలను వెంటఁ బెట్టుకొని అమాయుకుఁ డగు భర్తను లాగుకొనివచ్చి వాకిట నిలిచియున్నదని విన్నవించెను. అదివిని రేఁడు అవురా! ఆ కలనిక్కలయే ఆయెనని అచ్చెరువందుచుఁ దోడనె వారిని లోనికి రావించెను. అది అట్లగుటలో నమ్మకముచిక్కి తన కడుపున బంగారుపుత్త్రుఁడే పుట్టునని వాసవదత్తయు ఉప్పొంగెను. ఆ నూతన యువతి లోనికి అడుగు వెట్టుచునే బిక్క మొగము వైచి ఏదో నటన చేసి–అయ్యా! ఈయన నా భర్తయయ్యు నన్నుఁ గంటనైనఁ జూడఁడు. కూడుగుడ్డ లీయఁడు. నావల్ల దోసమ్మా లేదు. అని మొత్తుకొనెను. అప్పుడు దాని భర్తయు దేవా! దీని మాటలు వట్టి కల్లలు. చుట్టాలతోఁ జేరి ఈ పాతకి నన్నుఁ జంపఁ దలంచినది. ఏఁడాదికి సరిపడిన సర్వభాండారము మొదటనే దీనికి ఇచ్చియుంటిని. ఈ మాటకు దీని చుట్టాలే సాక్షులు. అని తన గోడు తాను వెళ్ళఁబోసికొనెను. వత్సరాజు సర్వము విని వాసవదత్తా స్వప్నరూపముగ పరమేశ్వరుఁడే దీనికి ప్రత్యక్షసాక్షి యని నిరూపించి ఈబిడను దీని యాబలగమును దలగొట్టింపవలసినదని తత్క్షణమే ఆజ్ఞయిచ్చెను. కాని యౌగంధరాయణుఁడు నోరు చేసికొని దేవా! స్వప్నము మాట లోకు లెఱుంగరు గదా! అందుచే ఈమీ తీర్పును నమ్మరేమో! సాక్ష్యమును బిలిచి తీర్పు దిద్దుటయే సర్వథా శ్రేయమని చెప్పెను. సరే యని రాజును సాక్షులను బిలిపించి విచారణ పెట్టెను. ఆబిడమాట లన్నియు అబద్ధములే యని సాక్ష్యము తేలెను. అప్పుడు వత్సరాజు – ఆ దుశ్శీల పతి

ద్రోహము తలబెట్టినదని తేల్చి దానిని దాని చుట్టాలను దేశము వెడలఁగొట్టించి ఆయమాయికునికి జాలివడి వేఱే పెండ్లి చేసికొమ్మని చాలినంత సొమ్మిచ్చి పంపెను. ఆనల ఆ ప్రస్తాన మెత్తి ఔరా! దురవస్థలోఁ బడి కొట్టుమిట్టాడు పూరుషుని బ్రతికియున్న వానినే దుష్టభార్య పీఁకి కాకివలెఁ బొడిచి పొట్టను బెట్టుకొనును. మంచి వంగడములోఁ బుట్టి సంప్రదాయము చక్కఁగా నెఱిఁగి నెయ్యము తియ్యఁదనము చూపనేర్చి తాపము హరింపఁదగిన యిల్లాలు నూటికిఁ గోటికి ఎవ్వనికో ఒకనికి పున్నెము చేసి పుట్టినవారికే దక్కును. ఆమె చేయూఁతచే నాతండు చెట్టునీడలోఁ బోలె సుఖపడి పోవును. అని పలుక వత్సరాజుతో ప్రక్కఁగాఁ గూర్చున్న వసంతకుఁడు కథాకుశలుఁడు కావున మాట అదుంకొని ఇట్లని చెప్పఁదొడంగెను.

రాజా! నెయ్యముగాని కయ్యముగాని వారి వారి పూర్వజన్మ కర్మములనుబట్టి కానవచ్చును. అప్పటికిఁ దోఁచి నవే హేతువులని భ్రాంతి వడరాదు. ఈ మాటకు – ఇదిగో ఈ కథ వినుఁడు:—

## సింహపరాక్రముఁడు

వారణాసిలో విక్రమచండుఁ డని ఒకరాజు ఉండెను. ఆయనకు మనసు నచ్చిన భృత్యుఁడు సింహపరాక్రముఁడను వాఁడు. ఆతఁడు రణరంగములోనే గాదు, జూదములో సైతము మొనగాఁడు. ఎందును ఓటమి మాటయే యెఱుఁగడు. పాపము వాని భార్య వట్టి పాపిష్ఠురాలు. పైగా వాడు రూపము. చిత్తము బొత్తిగా మంచిదిగాదు. ఆబిడకు పేరుకూడ కలహకారిణి యని సార్థకమైనదే పెట్టిరి.

సింహపరాక్రముఁడు నిత్యము ధనమును విస్తారము గడించును. రాజులు సైతము మెచ్చి యిత్తురు. జూదములో పెద్దగా వచ్చిపడును. అంతయు నాతఁడు దానికే కట్టఁ బెట్టును. దాని కడుపున ముగ్గురు బిడ్డలుకూడఁ బుట్టిరి. అట్లయ్యు - ఆబిడ ఒక్క క్షణమేని మగనితో జగడమాడక బ్రదుకనేరదు. అదిగో నీవు-ఎక్కడనో త్రాగుచున్నావు. తెరగాఁ దినుచున్నావు. మా మాట నీకుఁ బట్టదా? అని బిడ్డలను వెనుకవైచుకొని కాట్లకుక్క వోలె బొయ్యిమని మొఱుగుచుఁ జేతులు త్రిప్పుచు పెద్దగా దెప్పుచు పదేపదే వానిని హతమార్చును. రేయింబవలు - అన్నపానములకు గుడ్డ గోచులకు రవంతయేని తఱుగు గిఱుగులు సేయక ఆతఁడు దానిని మంచి జేసికోవలెనని నిరంతరము పాటు పడును. కాని వానిపై అదే పనిగా కయ్యమునకుఁ గాలు త్రవ్వును. కన్ను లుఱుమును. పళ్ళు కొఱుకును. విఱుఁగఁ బడును. పేరికి మాత్రము ఆతఁడు సింహపరాక్రముఁడే; కానీ ఆబిడ మ్రోల వట్టి పిల్లిపిల్ల. ఎంతయని యోర్చు కొనును? ఎన్నాళ్ళని చూచును? లాభము లేదని తోఁచి కడుపులోఁ గోపము పట్టలేక లోలోపలఁ గుమిలి కూలారుచు- ఇల్లు విడిచి వింధ్యాటవికిఁ బోయెను. అచ్చట వింధ్యవాసిని దేవికి మ్రొక్కి నిరశనవ్రతము పట్టి బద్ధదీక్షగా ఉపాసించెను. కలలో నామె కానుపించి ఓయీ! బిడ్డా! లేవోయీ! నీ గుండె దిగులు గుఱుతించితిని. పో! ఆ వారాణసికే పో! ఆ యూరి పఱుగడ ఒక పెద్ద మఱ్ఱి యున్నది. దానిక్రింద త్రవ్వితివా! ఒక నిధానము కనిపించును. దానినడుమ విరాజ మానమైన గరుడమణి పాత్ర మొకటి ఉండును. దానిలోఁ

జూచినచో మనమన పూర్వజన్మ వృత్తాంతములు అచ్చు గ్రుద్దినటులు వ్యక్తమై భాసించును. నీ భార్య పూర్వజన్మమును గూర్చి ఒకతూరి పరీక్షింపుము. ఆవల - ఆ నిధిని గైకొని పోయి సుఖముగా నిలుదీర్చుకొమ్ము పొమ్మని వరమిచ్చి వానిని బంపెను. వాఁడును పొంగిపోయి వఱువాతనే లేచి పారణచేసి కాశీప్రయాణము కట్టెను. దేవి చెప్పిన లక్షణమునుబట్టి మఱ్ఱివద్దకుఁ బోయి ఆ నిధానమును త్రవ్వి- ఆ మణిపాత్రమును గాంచెను. ఉత్సుకతతోఁ బరీక్షగాఁ దన జన్మము భార్య జన్మమునుగూర్చి పాత్రలోఁజూచెను. వెనుకటి జన్మములో దాను సింహమఁట. తన ఇల్లాలు-ఎలుఁగుబంటుఁట. ఆ పుట్టువులోని జాతివైర వాసనయే - ఈపుట్టువున-ఈ రీతిగ సంక్రమించినదని ఆతని బుద్ధికిఁ దోఁచినది. సంశయము సర్వాత్మనా తీఱెను. మోహము మొదలంట వదలెను. మణిపాత్రలోని మహిమనుబట్టి కన్యకామణులను పెక్కురను బరీక్షించుకొనెను. కడచిన జన్మములో సింహియై ఇప్పుడు సింహశ్రీ యనుపేరఁ దనరారు కన్యకామణిని ఒకర్తుకను ఆతఁడు పెండ్లాడెను. జన్మమునకు హాయి చిక్కెను. ఆ తగవులమారి దానికి కమికెఁడు పిండము వేయించుచు - ఎడముగా నుంచి ఆ దొరకిన పెన్నిధిచే ఐశ్వర్యవంతుఁడై చిన్న భార్యతో సుఖముగాఁ గాలము గడపెను. దేవా! మానవులలో దాంపత్య సౌఖ్యము విచ్ఛిత్తికి నిట్టివే పెక్కులు కారణములు కన్పట్టును. నెయ్యముగాని కయ్యముగాని పూర్వ సంస్కార వశములనుట ముమ్మాటికి నిక్కము. వసంతకుఁడు చెప్పిన ఈ విచిత్ర కథను విని వాసవదత్తావత్సరాజులు మిక్కిలిగా సంతసించిరి.

## మంత్రికుమార జననము

ఇంతలో మంత్రిపుంగవుల కందఱకు సర్వలక్షణ లక్షితమగు సంతానము కలిగెను. మున్ముందట యౌగంధ రాయణునకు మరుభూతి పుట్టెను. ఆవల రుమణ్వంతునకు హరిశిఖుఁడు కలిగెను. పిదప వసంతకునకు తపంతకుఁడు పొడమెను. పదపడి నిత్యోదితుఁ డను వానికి ప్రతీహారాధి పతికి గోముఖుఁడు జన్మించెను. ఎల్లరు ఎల్ల విధముల వేడు కలో నుండఁగా వత్సరాజు వంశాంకురమగు చక్రవర్తికి - ఈ బిడ్డలు దొడ్డమంత్రులై విశేషప్రతిభాశాలులై వెలయఁ గలరని అశరీరవాణి వినిపించెను.

## రాజకుమార జన్మము

కతిపయ దినములు - ఈ తీరుగఁ గడవఁగా వాసవ దత్తకు ప్రసూతిసమయము డగ్గఱించెను. ప్రసవవేదన మాసన్నమాయెను. సూతికా గేహము - అరిష్టశూన్యమై అగదంకార సన్నిహితమై సర్వపరికర విరాజితమై యొప్పెను. మాంత్రికులు మంత్రములు తంత్రములు చక్కఁగా నెఱపు చుండిరి. లాజాపూర్ణములైన కుంభములు శుభములు సూచించుచుండెను. ప్రదీప్తములగు శస్త్రాస్త్రములు - ఆమె చుట్టును బెట్టిరి. పిచుమంద పల్లవాదులను వ్రేలాడఁగట్టిరి.

జనిష్యమాణ పుత్త్రముఖావలోకన కౌతూహల మొక వంక బిట్టుగ - ఆకర్షించి దుఃఖాపనోదనము కావింప - ప్రతీచీదిశ చంద్రుని గన్నమాడ్కి - వాసవదత్తాదేవి మనో హరస్వరూపునిఁ గుమార రత్నమును గనెను. పుణ్యాంగనలు గుములు గట్టి పురుడు వచ్చె - పురుషుఁడు పుట్టెనని కేకలు

నైచిరి. పౌరులెల్లరు హర్ష కోలాహలములో ఆనందాబ్ధిని
గ్రుంకు లిడిరి. వత్సరాజునకు–అంతరంగికుఁ డొకఁడు అప్పుడే
ఆ శుభవార్త చెవిని వేసెను. ప్రియవార్తానివేదనమునకై
బహూకృతిగాఁ దనరాజ్యమంతయు ఆతనికిఁ గట్టఁబెట్టవలయు
నన్నంత సంబరము పుట్టుకొని వచ్చెను. లేక లేక కల్గిన
ఈ సంతానమును ఆ భూకాంతుఁడు కన్నుల కఱవు దీఱఁ
జూచుకొని ఆనందబాష్ప ప్లావిత వదనారవిందుఁ డాయెను.
యౌగంధరాయణాదులును సంతోషపారవశ్యమున ఒడలు
తెలియనివారై భావనాసౌధములలో నూయేల లూఁగుచుండ
ఆకాశవాణి యిట్లని వినిపించెను — ఓహో! ఉదయన మహా
రాజా! సర్వథా నీవు ధన్యుండవు. కామదేవుండే వచ్చి నీ
కడుపునఁగుమారుఁడై పుట్టినవాఁడాయె. ఈలోకములో ఈతని
పేరు నరవాహనదత్తుఁడు. సర్వవిద్యాధరాధీశులకును సర్వే
శ్వరముగ – ఈతఁడు చక్రవర్తియై చాలఁ గాలము చక్కఁగా
రాజ్యమేలును. అని ఆమాట ఆఁగెనో లేదో ఆకాశములో
నుండి పూలవాన కురిసెను. నగారాలు నలుదిక్కులలో
మ్రోగెను. చల్లని వాయువులు – ఎల్లయెడల వీచెను.

ఈ రీతిని ప్రకృతియంతయు ప్రకృతులను రంజింపఁ
జేయఁగల ప్రతిభాదికము అగ్గలముగా ఈతఁడు గడించునని
భావివార్తను వ్యక్తపఱుపఁగా కల్లోలమాలాభీలమై సాగరము
పొంగినట్లు వత్సరాజు పుత్రోత్సవములో నుప్పొంగిపోయెను.
కోటలో మ్రోగెడి తూర్యనాదములు దిక్కుల కెగఁబ్రాకి
విద్యాధరుల కెల్లరకు రాజకుమార జన్మము చాటుటకో
అన్నట్లు నింగి యెల్లెడలఁ బర్వెను. కామదేవుఁడే సాంగుఁడై

జన్మించెనని సంతోషము పట్టలేక సురాంగనలవంటి వారాంగనలు — అంతిపురిలో నర్తింపఁజొచ్చిరి. ఆనాఁడు పౌరబృందమునకు ఱేఁడు పంచియిచ్చిన వస్త్రాభరణాదులను జూచిన — వైభవములో నగరమెల్ల నగరికి ఈడుజోడుగా స్ఫురించెను. అర్థిబృందమున కాతఁడు ధనరాసులు గ్రుమ్మరించుచుండఁగా బొక్కసములోఁ దక్క మఱెక్కడను రిక్తత మందుకైనఁ గానరాలేదు. ఇత్తెఱంగునఁ బుత్త్రోత్సవము పెక్కుదినములు సాగి పౌరుల మనోరథములకు సర్వాత్మనా సాఫల్యము చేకూర్చెను.

ఆకాశవాణి ఆదేశమునుబట్టి యథావిధిగ రాజకుమారునకు నరవాహన దత్తుఁడని నామకరణము చేసిరి. ప్రతిపచ్చంద్రుఁడువోలె బాలుఁడు నానాఁడు నవనవలాడుచు — అల్లారు బెల్లమై గారాల కూచియై ముద్దు మురిపములతోఁ బెరుఁగుచుండెను. వచ్చియు రాని ఒండు రెండు తప్పుడడుగులతో మొలక దంతముల కాంతులను ముద్దు వెట్టుకొని ముచ్చట కూర్చు తొక్కుఁబలుకులతో-అనిమిత్తహాసములతో తల్లికిఁ దండ్రికి బ్రహ్మానందము గూర్చుచుండెను. సచివోత్తములప్పుడు హృదయానంద కరులగు నిజనందనులను రాజకుమారునకుసబ్రహ్మచారులుగఁ జేసి చూచుకొనుచుండిరి. పౌరోహితుఁడగు శాంతికరుఁడు పింగళికకవలబిడ్డలను శాంతిసోముని వైశ్వానరుని — అందే అర్పించెను. దేవీసమేతుఁడై ఉదయన మహారాజు మంత్రిపుత్త్రిలను దద్దయు గారవించి అత్తఱి పెద్దయు వేడుక ఒనర్చెను. నరవాహనదత్తుఁడు — ఈ తీరుగ శైశవమందే ఈడుజోడై అభిముఖులైన ఆఱుగురు కుమారులతో నిరంతరము కూడిమాడి ఆటలాడుచుఁ బాటలు

పాడుచు చదువుసంధ్యలలో గుణగణములలో సంప్రదాయ శుద్ధిలో అత్యంతము రాణించుచు తల్లికిఁ దండ్రికి దేశమున కంతకు మోదమును గూర్చుచు నవనవోన్మేషశాలినియై తనరారు చుండెను.

కానక కన్న సంతానము కావుటను విద్యాధర చక్రర్తిగా అగునని పేరుమోయుటను వాని స్నేహము వత్సరాజునకు పాపశంకియయ్యెను. కుమార సంరక్షణలో ఉద్విగ్నచిత్తుఁడైన జేనితో మహామంత్రి యొకనాఁడు - ఏకాంతమున నిట్లనియె — దేవ! రాచపట్టిని రక్షించుటలో నీవు లవలేశము చింతింపవలదు. సర్వవిద్యాధర చక్రవర్తి కాఁగల - ఈ బిడ్డను నీయింటిలోఁ బెట్టినది సాంబశివుఁడు గదా! ఇది యెఱింగి పాపాత్ములు విద్యాధరులు కొందఱు - అసూయాగ్రస్తులయి రంధ్రాన్వేషణము సేయుట నిక్కమే. అందువలనఁ బరమేశ్వరుఁడు స్తంభకుఁడను గణేశునికి - ఈతనిఁ గాపాడు మని ఆనవెట్టెను. ఆతఁ డెల్లవేళల లాఁతి వారి కంటఁబడకయే ఈ పిల్లవానిని గనిపెట్టుచుండును. నారదులవారు ఇయ్యది, యెఱింగించిరని మహామంత్రి విరమించినదే తడవుగ నభోవీధిలోనుండి కిరీటధారియై దివ్య పూరుషుం డొకఁడు - అవతరించి జేనికి మ్రొక్కి నిలిచి యుండెను. ఆతనిం జూచి వత్సరాజు సత్కరించి, ఎవరవు నీవు? ఏ పనిమీఁదట నిందు వచ్చితివో! అని ప్రశ్నవైచెను. నవ్యపూరుషుం డయ్యా! నేను తొల్లి మనుష్యుఁడనై యుండి - ఆవల విద్యాధారాధిపతినైతిని. నాపేరు శక్తి వేగుఁడు. నా కెందఱో శత్రువు లున్నారు. నీకుమారుఁడు మాకు సార్వభౌముఁడు కాఁగలఁడని నా శక్తిని బట్టి యెఱింగి

ఈ నీ బిడ్డను దర్శింపను వచ్చితిని. అని యప్పుడే నరవాహన దత్తుని భవిష్యచ్చక్రవర్తిని సందర్శించి ధన్యోస్మి యని సంతసించెను.

అంతట వత్సరాజు మిత్రమా! విద్యాధరత్వ మన నెట్టిది! అది యెవ్వరి కెట్లు దక్కును? నీ కది యెట్లు కలిగెనో వివరింపుమా వినెదమని వింతగా నడిగెను. దాని కాతఁడు రాజా! పరమేశ్వరు నారాధించి పున్నెము గడించిన వారికే విద్యాధరత్వము లభించును. అందులో పెక్కు త్రోవ లున్నవి. విద్యాఖడ్గ మాలాదికములు దానికి సాధనములు. అని వివరించి తన మానవజన్మకథ లెల్ల - ఆనుపూర్వ్యముగ వినిపించి దేవ! మనుష్యుఁడ నయ్యు నేను సాంబసదాశివుని సత్కరుణఁజేసియే విద్యాధరాధిపతి నైతిని. నా ప్రభువును జూచితిని. మీకు సర్వ శ్రేయములు కలుగునుగాక, పోయి వత్తునని పలికి జోతలు వెట్టి సెలవు గైకొని రివ్వున నింగి వైపున కెగిరిపోయెను.

ఈ తీరుగ మహామాత్యుఁడు యౌగంధరాయణుని ప్రజ్ఞాపాటవముచే అంతరాయము లన్నియు గడచి వాసవ దత్తా పద్మావతుల ఆనుకూల్యము నిరంతరము పడసి, విద్యాధర సార్వభౌముఁడగు నరవాహనదత్తుని కుమార రత్నమును గాంచి నిజవైభవ తృణీకృత మహేంద్రుఁడై వత్సరాజు సమస్త కల్యాణములు చవిచూచి రాజ్యభారము కుమారరత్నము భుజస్కంధముల నునిచి దేవేరులతో యౌగంధరాయణాది మంత్రిసత్తములతో హాయిమెయి కాలము గడపుచుండెను.

